శ్రీరస్తు.

# బమ్మెరపోతరాజు

## చరిత్ర



గ్రంథకర్త.

అత్తిలి స్థానికమధ్యమ పాఠశాలాంధ్రోపాధ్యాయులగు

అయ్యగారి వీరభద్రరావుగారు

ప్రకాశకులు.

టి. వి. రమణయ్య & బ్రదర్సు.

నేషనల్ బుక్కుడిపో, రాజమండ్రి.

మొదటికూర్పు 1000 ప్రతులు

శ్రీసుజనరంజనీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

రాజమహేంద్రవరము

1926.

 [వెల రు 0—12—0

# పీఠిక

భక్తాగ్రేసరులారా!

కవివరులలో నగ్రగణ్యుఁడును, ఆత్మగౌరవముగల్గిన మహనీయుఁడును, సహజపాండిత్యసంపన్నుఁడును, అగు బమ్మెర పోతరాజు చరిత్రము రచియింపవలయునని మనంబునగల్గిన యుత్సాహమును నాకుఁగల సమర్థతాసమర్థతల నించుకైన మదినెంచక సాహసంబున నిట్టిచరిత్రమును సంపూర్తి యొనర్చితి. వివిధగ్రంథ పఠనాధురంధరులగు దోషజ్ఞులీగ్రంథమునఁ గల నేరములవదలి సరసములఁగొన ప్రార్థన

అత్తిలి
1-1-1926

ఇట్లు విన్నవించు బుధజన విధేయుడు,
అయ్యగారి వీరభద్రరావు.

# విషయసూచిక

—:0:—

| | వుట సంఖ్య |
|---|---|


N. B. సర్వసామ్యసంకలితములు ప్రకాశకులవి.



శ్రీదక్షిణామూర్తయేనమః

# బమ్మెరపోతరాజు

అష్టాదశపురాణంబుల సంస్కృతంబున రచియించిన వ్యాసకృతభాగవతము నీమహాకవియుం డాంధ్రీకరించె. ఆత్మగౌరవము గలిగిన కవీశ్వరులలో నీతఁ డగ్రగణ్యుడు.

సప్తసంతానములలోఁ గృతినొందుట ముఖ్యమని పూర్వపు నృపతులు కవీశ్వరుల నాదరించి వారలు రచించిన గ్రంథంబుల నంకితముఁగొని యాకవులకు ధనధాన్యంబులును, మాన్యంబులును, అందలంబులును, గుఱ్ఱములును, ఏనుంగులును అగ్రహారంబుల నిచ్చెడివారు. అందున కేయొకవి.

"చ. అవనిపు డాదరించిన భటాళిభటుత్వముఁ వైద్యువైద్యముల్
కవికవితామహత్వమును గాయకుగానము కోటిసేయున
య్యవనిపు డాదరింపని భటాళిభటుత్వము వైద్యువైద్యముల్
కవికవితామహత్వమును గాయకుగానము గవ్వసేయునే.

అనియు

"ఆ॥ వె॥ ఆఢ్యుడున్నయప్పు డందరుపూజ్యులే
లెక్కమీద సున్న లెక్కినట్లు
లతడు వోవువెన్క నంద రపూజ్యులే
లెక్కలేక సున్న లేగినట్లు.

అనియుఁ జెప్పియున్నవాడు. దేశంబున నొక కళ వృద్ధిఁజేయుట నృపతుల ధర్మము. కవిత్వముఁగూడ కళయే.

పూర్వకాలమున దైవకటాక్షముఁ బడసి కవనముఁ జెప్పఁగవి దేశమున కొక్కరుండే వెలసియుండె. ప్రస్తుతమన్నఁ బ్రతియూరను బ్రతియింటను కవులు వెలసిరన్నమాట జగద్విదితమే. నేటికిఁజూడఁ గవులకుఁ బోషణము తక్కువయయ్యె. అచ్చు చవకయ్యె. పుస్తకవర్తక మెక్కువయయ్యె. 'ఇంటనుండిన మంటిపాలేగదా' యని కవీంద్రులు తాము వ్రాసినపుస్తకముల పైఁగల శాశ్వతహక్కుల వదలి ప్రచురణ కర్తల కచ్చువేయించుకొనుట కిచ్చుచుండిరి.

ఇప్పుడు దేశమున ననేకులు బయలుదేరి వ్రాసిన పుస్తక రాజంబుల బరికించి వారివలెఁ దానును 'కవి' యను నామముంచు కొనవలయునని నాలుగుబిరదము లుంచుకొని తామేదియో వ్రాసితి మని పుస్తకములఁ జంకనిరికించుకొని దిరుగు మహనీయుల నందము గనుచునేయుండిరి. మహాత్ముల గురిమర్మకులు ప్రపంచకమున ప్రబలిరి కాని లేకున్న వీరలుఁ 'నిరంకుశాః కవయః' యనెడార్యోక్తి సార్థకము తలక్రిందుగాఁ జేయకుందురా! ఆవిషయమై కవీంద్రుల ననవలసిన దేమియులేదు. ఆదరింపని భూపతుల ననవలసిన దేదియులేదు. ప్రచు రించుచుండిన ప్రచురణకర్తల ననవలసినదియు లేదు. ఇంకెవరి ననవల సిన దనెదరేమో!—కవుల నాశ్రయించి పీడించి స్వల్పలాభములకు సంతసింపఁజేసి పురిగొల్పు దరిద్రదేవత ననవలసినదికాని భాషకొఱకు బాటుపడు కవుల ననవలసినదియులేదు.

ఏదరిద్రమైననేమి ? ఎన్ని యిక్కట్టులు ప్రాప్తించిన నేమి ? స్వగౌరవరక్షకులు సంస్తవనీయులుగదా!—అట్టి మహనీయుం డీ కథా నాయకుఁడగు బమ్మెర పోతనామాత్యుడని తొలుదొల్త నే వ్రాసి యుంటి.

సీ. కౌండిన్యగోత్రసంకలితు డాపస్తంభ
సూత్రుండు పుణ్యుండు శుభగుడైన
భీమనమంత్రికిఁ బ్రియపుత్రుఁడన్నయ
కలకంఠి తద్భార్య గౌరమాంబ
కనుఁగాపుత్రవరమునఁ గనియె సోమనమంత్రి
వల్లభ మల్లమవారితనయు
డెల్లన యతనికి యిల్లాలు మాచమ

ఆ. వె. లలితమూర్తి బహుకళావేది కేసన
దానమాననీతిధనుడు ఘనుడు
తనకు లక్కమాంబ ధర్మగేహినిగాఁగ
మనియె శైవశాస్త్రమతము గనియె.

అని యీకవి భాగవతంబున తన వంశావళి స్పష్టపఱచెను. మఱియు తనతల్లి లక్కసుగుణములు వర్ణించి యొకటిరెండు పద్దెములఁ జెప్పె. ఎట్లనిన ?

ఉ. మానినులీడుగారు బహుమాన నివారిత దీనమానస
గ్లానికి దానధర్మమతిగౌరవమంజులతాగభీరతా
స్థానికి ముద్దుసానికి సదాశివపాద యుగార్చనానుకం
పానయవాక్యవానికిని బమ్మెర కేసయ లక్కసానికిన్.

పైపద్యంబునఁ దల్లిదండ్రుల వర్ణించి.

కం. ఆమిథునమునకుఁ బుట్టితి
మేమిద్దర మగ్రజాతు డీశ్వరసేవా
కాముఁడు దిప్పయపోతయ
నామవ్యక్తుండ సాధునయయుక్తుండన్.

అనుచుఁ దన వంశావళి తనవలెనే చెప్పి ముగించెను. అనగా బమ్మెరవారి వంశజులు కౌండిన్యగోత్రులనియు వంశ భీమనమంత్రికి నన్నయ యనునాతఁ డుదయించెననియు, ఆయనకు గౌరమాంబభార్య యనియు, నామిథునమునకు సోమనమంత్రి యుదయించెననియు నా సోమనమంత్రికి ధర్మపత్ని మల్లమాంబయనియు వారిరువురకు నెల్లన మంత్రి యుదయించెననియు నాయనకు మాచమభార్యయనియు నా మిథునమునకుఁ గేసనమంత్రి యుదయించెననియు నాతనికి లక్క మాంబ భార్యయనియు, నా కేసన శైవాచారసంపన్నుండనియు వార లకు (కేసనలక్కమాంబలకు) దిప్పయ్యయనియుఁ బోతయ్యయనియు నిరువురుపుత్రకు లుదయించిరనియు వ్రాసెను.

పోతన సహజపాండిత్యము గలవాడని యాతనిచేఁ జెప్పంబడిన భాగవతాశ్వాసాంత గద్యవలన దెలియుచున్నది. అనగా నొకగురు నియొద్ద కావ్యాలంకార గ్రంథములు చదువకుండగనే దైవకటాక్ష మున నతడు పాండిత్యమును సంపాదించినట్లు భావము.

## భాగవత గద్య.

ఇది శ్రీపరమేశ్వర కరుణా కటాక్ష కవితా విచిత్ర కేసనమంత్రి పుత్రసహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతము.

## తాత్పర్యము.

ఇది (భాగవతము) పరమేశ్వరుని కరుణవలన పొందిన కవనము గల్గిన కేసనమంత్రి పుత్రుఁడైన పోతనామాత్యునిచే రచింపబడినదని యు భావము. ప్రస్తుతవిజ్ఞానకలితులామాటను పాటింపకనుసందేహము మీరుపడవచ్చును. ఏలయనిన? భక్తినశించి దేవాలయములు పాడుప డినవి. వేదములు కృశించినవి. ధర్మశాస్త్రములు తగులబడనవి. పురా

ణములు బూతులైనవి. ఇక నవనాగరికులకీ వాక్కులు నమ్మశక్యములగునా !

శ్రీమద్రామాయణంబున వాల్మీకి మునీంద్రుడు “శ్రీరామచంద్రమూర్తి రావణ సంహారమొనరించిన పిదప సీతాపరివారయుతుండయి లంకనుండి పుష్పకంబున నయోధ్య కేతెంచె„నని వ్రాసిన—అట్లుండునా? ఎచ్చటలంక? ఎచ్చటఅయోధ్య! కొలదికాలములోనయోధ్యకువచ్చెనాయని పరిహసించి అట్టహాసములొనర్చి ప్రత్యక్షమిప్పడేదియైన జూపుదురాయని కేకలువేసి బల్లలుకొట్టిన మహనీయులు కుశాగ్రబుద్ధిమంతులైన పాశ్చాత్య దేశస్థులు వాయువిమానములు గల్పించిరని వారిబుద్ధిచాతుర్యమునకు మెచ్చుకొని రామాయణముపై తాము పడిన దురభిప్రాయమును మఱల్చుకొనునట్లు పోతనసహజ పాండిత్యముగలవాడని నేటికైన నమ్మకయుండరని నాతలంపు.

భక్తియోగమునకుమించిన యోగమేదిగలదు? ఈపోతరాజు ఏకశిలానగరవాసి. ఏకశిలానగరమనగా నొంటిమిట్టయని కొందఱును, ఓరుగల్లని కొందఱును జెప్పుదురు. ఏకశిలానగరమన వాక్యార్థము ననుసరించి ‘ఒంటిమిట్ట’ యనుటకంటె ‘ఓరుగల్లు’ అనిచెప్పుటయే బాగుగా నొప్పు. ‘కల్లు’ శబ్దము రాయిగా వాడబడుచున్నది. ఉప్పుకల్లనవినమా అనగాఉప్పురాయిగదా! మిట్టయనగుట్టకు పేరగునట్లుతోచు గాన నోరుగల్లనుటయే బాగు. ఇది ప్రతాపరుద్రునిచే బరిపాలింపబడినదని కొందఱు, కాదని కొందఱు నుడువుదురు. ఏదియైననతని వాసస్థలమేకశిలానగరము. ఈతఁడు చిన్నతనమునందు గోసంరక్షణార్థమై తన్నగరంబునకు సన్నికృష్ట పర్వతాగ్రంబున సంచరించుచున్న సమయంబున ‘జిదానంద యోగీంద్రుఁడను ఋషిశ్రేష్ఠుఁడాతనికి దృగ్గోచరుండైనంతనాపోతనామాత్యుఁ డమ్మహాత్మునిఁగాంచి ‘యుతనిదాపునకుంజని

యత్యంతభయభక్తుల ననవతశిరస్కుఁడై యభివందనంబొనరించి శరణు జొచ్చితినని పలుక నాతపోధనుఁడు బాలకుఁడగుపోతన యందవ్యాజ కరుణనుంచి శ్రీరామమంత్రోపదేశ మనుగ్రహించి తదనుష్ఠానక్రమం బశేష ముదెల్పి కృతార్థుండవు గమ్మనిదెల్పె

ఈచరిత్రము కొందఱు నిజమనియుఁ గొందరనృతమనియుఁ బలుకుచుండిరి. ఎట్లనిన నీతఁడుజిదానందు యోగీంద్రకరుణాకటాక్షలబ్ధ తారకమంత్ర జనితకవితా సుధారాశిగనుక నాయోగీంద్రుంచు తనకుగురువు గనుక తనగురుస్మరణ దానురచించిన భాగవతమునందెచ్చటనైన వ్రాసెనా? అట్లు వ్రాసినట్లు గన్పట్టదు. ఎట్లువ్రాసియుండెనని చదువరు లనుకొనకబోరు. అదెట్లనిన „అవియిష్టదేవతలఁదలంచి చింతించి దినకర కుమారప్రముఖులందలంచి ప్రథమకలితా విరచిన విద్యావిలాసాతిరేకి వాల్మీకి నుతియించి హయగ్రీవ దనుజకర పరిముషిత నిగమనివహవిభాగ నిర్ణయనిపుణ తాపసములాసుండగు వ్యాసునకుమ్రొక్కి శ్రీమహాభాగవత కథాసుధారస ప్రయోగికి శుకయోగికి నమస్కరించి మృదుమధుర వచనవర్గపల్లవిత స్థాణునకుం బాణునకుం బ్రణమిల్లి గతిపయశ్లోక సమ్మోదితనూరు మయూరు నభినందించి మహాకావ్య కళావిలాసుం గాళిదాసుంగొనియాడి కలికమలర విభారవింబొగడి విగళితాఘు మాఘుంబూజించి యాంధ్రకవితా గౌరవజన మనోహారినన్నసూరిం గైవారంబుసేసి హరహరచరణారవింద వందనాభిలాషిం దిక్కనమనీషింబూజించియు మఱియు నిరతపూర్వకవి జనసంభావనంబు గావించి వర్తమానకవులకుం బ్రియంబువల్కి భావికవుల బహూకరించి యుభయకావ్య కరణదక్షుండనై”

అని యున్నది. అనగా వాల్మీకుని, వ్యాసుని, శుకయోగిని, బాణుని, మయూరుని, కాళిదాసుని, మాఘుని, భారవిని, ఆంధ్రకవి

తారచనాదురంధరులగు నన్నయను, తిక్కననుగొల్చి యప్పటికాలపు కవులను గొల్చి భావికవులను బహూకరించి తానుత్రాయబూనునది యని వ్రాసె. పైన బోతనజెప్పిన గద్యలోఁ జిదానందయోగియొక్క ప్రశంసయే లేదు. అచ్చటగాకున్న తనగ్రంథమునం దెచ్చటనుగూడ నుదహరించియుండ లేదు. గనుక జిదానందయోగివలన పోతన రామ మంత్రము నుపదేశమొందిన చరిత్రము పుక్కిడిపురాణమని కొందఱను కొనెదరు. ఏమిటైన నామహానుభావుని పాండిత్యము సహజపాండిత్య మని నమ్మవచ్చునుగదా. అది యెట్లు నమ్మవచ్చుననెదరేమో. పోత నామాత్యుండు చిదానందయోగివలన శ్రీరామమంత్రము నుపదేశము నొంది యాభక్తవత్సలుఁడైన శ్రీరామచంద్రుని దయాలబ్ధకవితా సుధారాశియసిన నాతని పాండిత్యమిట్టిదైనను సహజపాండిత్యమే. అయ్యది నిర్వివాదాంశము.

ఈకవికిఁ బరమేశ్వరసాక్షాత్కారముకూడ గలదని జెప్పెదరు. ఈయనకు శృంగారనైషధమును, భీమఖండ కాశీఖండములును, రచి యించిన భారద్వాజసగోత్రసంభవుడును, ఈశ్వరార్చనాపరుడును, బ్రహ్మదత్తవరప్రసాదుఁడును, కవిసార్వభౌముడును, రావుసింగభూపా లుని సంస్థానమందున్న శ్రీనాధకవివరుని సోదరి నిచ్చియుండెనట బావ మఱది నిరంకుశకవనము జెప్పుచుండియు భూపాలురకు కృతినిచ్చి యైశ్వర్యంబు గడియింపవలెనను విషయము—ప్రస్తుతకాలము నాం గ్లేయభాషల మాన్యముల నమ్మియైన జదివి ప్రభువులదరి గొప్ప యుద్యోగముల సంపాదింపవలయునని కుతూహలంబుబోలి కవివర్యు బూర్వమట్టికోర్కె ప్రభవించుచుండెడిది.

పోతనామాత్యుఁడు కవనము జెప్పగలిగియు నొరుల కంకితమి చ్చుటలేదనియు ద్రవ్యమును గడించుటలేదనియు శ్రీన సుఖ మనం

బున జింతించి భావమఱదింజూచి యేపుత్తమైన రచియించి భూపతు లకంకితమిచ్చి సుఖపడరాదా! యని పలుతెరంగులఁదెలుప నాపోత నామాత్యుండు సృష్టిస్థితిలయకారకుఁడైన పరమేశ్వరునకిచ్చు కృతిన రలకిడుట నుచితమగునా? మల్లెకుఁబోయునీరు పల్లేరునకు బోయు దురా!— నీయభిప్రాయమునకు నామదిసమ్మతించునా? నాయొద్దనిట్టి ప్రసంగముల నుడువవలదనిదెల్పి యాతనియూరడించెనట.

పాపము! శ్రీనాథకవికి మనశ్శాంతికలుగునా! ఎట్లుకలుగును? దరిద్ర దేవతచేఁ బీడింపబడుచుండిన పోతనకు ననసోదరిబిచ్చినవారలు కనరా నిపెక్కు బాముల నొందుచుండుటయు నాయిక్కట్టులఁగనుచు వినుచు నున్నమనసు మనసుగనుండునా? ఆలోచనఁబోచునా?— ఇట్లుండమన శ్శాంతియెట్టుండును?

శ్రీనాథకవీంద్రుండు సామదానభేద దండోపాయముల నుపయో గించియైన భావమఱది మనసుద్రిప్పి నరాంకితమిడునట్లుగావించి యైన లేనిద్రవ్యమువారలకు వచ్చునట్లొనరించి తనతోబుట్టువు సుఖమంద జేయఁదలంపుగలవాఁడై బోయీలఁబిలపించి అందలమెక్కి యేకశిలా నగరప్రాంతమునకు వచ్చుచుండెను.

పోతనామాత్యునకు పిత్రార్జితపు భూమి కొలదిగా నున్నందున దానిని సేద్య మొనరించుచుండెను. ఆనాడు పోతన పొలమును దున్నించుచు దానొక గట్టున నాశీనుఁడై యుండ సవారిమోత దిక్కులను భేదిల్లునట్లుగను దిగ్గజములు త్రుళ్ళునట్లుగ నాకసము వీగు నట్లుగ భూనభోంతరాళములు నిండవచ్చుచుండుట పోతన కనెను. ఏమిచిత్రము! ఆయందలము సమీపించుచున్నది ముందువైపున మ్రోయువాండ్రు లేకయె వెనుకవైపున నూలుగుచున్న బోయిల తోడనే వచ్చుట కాశ్చర్యము నొందుటకేమిగంత. అయ్యది పొలము

దున్ను సేవకుడుగని వింతగ పోతన్ననుగని: బాబూ! ఆపల్లకిని గనుడన నాతండుగని చిరునగవున బెదవివిఱచి తనసేవకునితో నోరీ! నీవొక యెద్దునుతోలివైచి మిగిలిన దానితో భూమునిదున్నుమన నాతఁ డట్లొనరింప పల్లకిగల శ్రీనాథుఁ డయ్యదిగని నేనొనర్చినపని యాతఁ డెఱింగి యొక్క పుంగవముతోడనే నేల దున్నింపుచున్నాడని మది విస్మయమొంది "ఏమగునో చూచెద" నని వెనుకబోయిల గూడ నాతడు తగ్గుడని యాజ్ఞాపించెను. గాలిలో నెగురుగ్రద్దవిధమున నిరాధారమై శ్రీనాథుని తపోమహాత్మ్యమున పల్లకి వేగముగావచ్చుట పోతన గని తన సేవకునకు నాగలికిఁగట్టిన రెండవయెద్దునుగూడ విప్పి వేయుమనియు నీవుతప్పుకొనుమనియు జెప్ప నాత డట్లొనరింప నాగలి విచిత్రగమనముతో నాభూమినిదున్నుటగని శ్రీనాథుండు తానొనరించిన పనులకుఁ బోతన వశీకరుడుకాడని ఆందోళికమును దిగి పోతనను సందర్శించి కృతసపర్యుడై నిలయమునకుజని భోజనానంతరమున దన రాకనంతయు బావమఱదికి నెఱింగించియు విఫలమనోరథుఁడై తన గ్రామమునకరిగెననియు గాథకలదు.

## భాగవతము పోతన రచించుట.

కవులకుఁ గలలలోఁ బరమేశ్వర సాక్షాత్కారము క్రొత్తగాదు గనుక బోతనామాత్యుని స్వప్నమందు శ్రీరామమూర్తి సాక్షాత్కరించి భాగవతముఁ దెనిగింపుమనినట్లు చెప్పెనట. అందుల కీతండు

కం. పలికెడిది భాగవతమట
పలికించెడువాడు రామభద్రుండట నే
పలికిన భవహరమగునట
పలికెద వేరొండు గాథ పలుకగనేలా!

అని చెప్పియుండెను. ఈతడు శ్రీరామకటాక్షమున దానురచించబోవు

భాగవతములో సంస్కృతమునకంటె నధికగ్రంథము జేర్చుటకు తనకుం గల యిష్టము సూచించుటకై క్రిందివిధమున నొకపద్యమును వ్రాసెను.

ఆ॥ వె॥ భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మిచూలికైన
విబుధజనులవలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత దేటపఱతు.

పోతనామాత్యుడు తనకవిత్వశైలిం జూచి తనకుం గల యభిప్రాయము సూచించుటకొరకై పద్యము వ్రాసెను

కం. కొందఱకు దెనుగు గుణమగు
కొందఱకును సంస్కృతంబు గుణమగు రెంటన్
గొందఱకు గుణములగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్.

పోతన తనకుఁ బూర్వపుకవులగు తిక్కనాదికవులెందరు పురాణాదుల దెనిగించినను భాగవతముఁ దెనిగించకునికి దాని రచియించి తరింప నెంచినట్లు వక్ష్యమాణవిధంబున దెల్పె.

మ. ఒనరన్ నన్నయ తిక్కనాదికవు లీ యుర్విం బురాణావళుల్
దెనుఁగుల్ సేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దా నెట్టిదో
దెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనుంగించి నా
జననంబున్ సఫలంబు సేసెద బునర్జన్మంబు లేకుండగన్.

పోతన శ్రీమదాంధ్రభాగవతమును నరాంకితము సేయక పరమేశ్వరున కంకితమిడె.

అంకితము.

పోతనయొనర్చిన యంకితమునందు కొంత రామాంకితముగనుండె.

కం. శ్రీమద్భక్తచకోరక
సోమ వివేకాభిరామ సురవినుత ఘనా

స్తోమ నిరలంకృతాసుర
రామా! సీమంతసీమ రాఘవరామా!

కం. శ్రీమహితవినుత దివిజ
స్తోమ యశస్సీమ రాజసోమసుమేరు
స్థేమ వినిర్జితభార్గవ
రామ! దశాననవిరామ రఘుకులరామా!

కం. శ్రీవిలసితధరణీతన
యావదనసరోజవాసరాధిపసిత రా
జీవదళనయన నిఖిల ధ
రావరనుత సుగుణధామ రాఘవరామా!

ఇట్లాధారములు గలవుగాని కొన్నిచోట్ల కృష్ణ నామాంకితముగూడ నుదహరించినట్లును గలవు.

క్రీ. శ్రీకరకరుణాసాగర
ప్రాకటలక్ష్మీకళత్ర భవ్యచరిత్రా!
లోకాతీతగుణాశ్రయ
గోకులవిస్తార నందగోపకుమారా!

శా. శ్రీకైవల్యపదంబుజేరుటకునై జింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలనకళాసంరంభకున్ దానవో
ద్రేకస్తంభకుఁ గేళిలోల విలసద్దృగ్జాలసంభూత నా
నాకంజాతభవాండకుంభకు మహానందాంగ నాడింభకున్.

షష్ఠ్యంతములందు

ఉ. హారికినందగోకుల విహారికి జక్రసమూరదైత్యసం
హారికి భక్తదుఃఖపరిహారికి గోపవితంచి నీమనో

హారికి దుష్టసంపద హారికి, ఘోషకుటీపయోఘృతా
హారికి బాలకగ్రహ మహాసురగుర్వనితాప్రహారికిన్.

ఉ. శూలికి నీతిశాలికి వశీకృతశూలికి బాణహ_స్తని
ర్మూలికి ఘోరనీరదవిముక్తశిలాహతగోపగోపికా
పాలికి వర్ణధర్మపరిపాలికి నర్జునభూజయుగ్మ సం
చాలికి మాలికిన్ విపులచక్రవిరుద్ధమ రేచిమాలికిన్.

ఉ. తుంతకుగాలియోరగ విశాలఫణావళిన_ర్తనక్రియా
రంతకు నుల్లస న్మగధ రాజచతుర్విధఘోరవాహినీ
హంతకు నిందిరానందనని యంతకు సర్వచరాచరావళీ
మంతకు నిర్జితేంద్రియసమంచితభ_క్తజనానుగంతకున్.

ఉ. న్యాయికి భూనురేంద్రమృతనందనదాయికి సాధుజనానురాగసం
స్థాయికి భూతసమ్మద విధాయికిసాధుజనానురాగసం
ధాయికి భీతరక్షపరిధాయికి బద్మభవాండభాండని
ర్మాయికి గోపికానివహమందిరయాయికి శేషశాయికిన్.

పైపద్యములబట్టిచూడ బమ్మెరపోతనామాత్యుని యుపాసనాదైవము శ్రీరాముడనియా ? లేక శ్రీకృష్ణుడనియా ?

చిదానంద యోగీంద్రునివలన శ్రీరామమంత్రము నుపదేశము నొందియున్నవాడని దొల్త నేనుడివితిమి కానబోనయిష్టదైవమునిశ్చం దేహముగా శ్రీరాముడేయనితలపవలయును.

శ్రీరాముడేష్టపోతనయిష్టదైవమైనయెడల శ్రీకృష్ణునిపేర నంకిత మిడిన పద్యములుగలవు. శ్రీరాముడే యిష్టదైవముగాగలిగినకవి శ్రీరామనామముచే యుదహరించవలయునుగాని శ్రీకృష్ణనామమేల యుదహరించె ?

పోతన శ్రీరాముని పరముగను శ్రీకృష్ణ పరముగను బద్యము లఁజెప్పియుండెను. అందువలననాతఁడు నింద్యుఁడుకాఁడు. విష్ణున కనేక నామములుగలవు. రాముడన్నను కృష్ణుడన్నను విష్ణునామములే కదా:—పోతన రాముఁడు విష్ణువుయొక్క రూపమేయని మనంబున నెంచి యిట్లువ్రాసియుండెను కాని పోతనయిష్టదైవము తప్పక శ్రీరాముఁడె

విష్ణునామములు (శ్లోకములు)

శ్లో॥ విష్ణుర్నారాయణః కృష్ణోవైకుంఠోవిష్టరశ్రవాః
దామోదరోహృషీకేశః కేశవో మాధవస్స్వభూః
దైత్యారిః పుండరీకాక్షో గోవిందోగరుడధ్వజః
పీతాంబరోచ్యుతశ్శార్ఙ్గీ విష్వక్సేనోజనార్దనః
ఉపేంద్ర యింద్రావరజశ్చక్రపాణిశ్చతుర్భుజః
పద్మనాభో మధురిపుర్వాసుదేవస్త్రివిక్రమః
దేవకీనందనశ్శౌరిః శ్రీపతిః పురుషోత్తమః
వనమాలీబలిధ్వంసీ కంసారాతిరధోక్షజః
విశ్వంభరః కైటభజిద్విధుశ్రీ వత్సలాంఛనః
గదాగ్రజోముంఁడకేశో దాశార్హోదశరూపభృత్॥

(అమరసింహుఁడు)

| విష్ణువుయొక్క నామములు. | నామములయొక్క యర్థము. |
|---|---|
| 1 విష్ణుః | విశ్వమున వ్యాపించియుండువాఁడు |
| 2 నారాయణః | (1) నరశరీరమును బొందినవాఁడు |
| | (2) జలమే స్థానముగాఁగలవాఁడు |
| | (3) నరసమూహమునకు స్థానమైనవాఁడు |
| 3 కృష్ణః | (1) అన్నిటి జేయువాఁడు |
| | (2) నల్లటివాఁడు |

4 వైకుంఠః — వికుంఠయను తల్లియందవతరించినవాఁడు

5 విష్టరశ్రవాః — దర్భపుఁడివంటి చెవిగలవాఁడు

6 దామోదరః — ఉదరమున దులసిమాలగలవాఁడు

7 హృషీకేశః — ఇంద్రియముల కీశ్వరుఁడు

8 కేశవః — (1) మంచివెండ్రుకలుగలవాఁడు

(2) కేశియను నసురుని జంపినవాఁడు

9 మాధవ — (1) లక్ష్మీదేవికి భర్త

(2) మధువనెడి వాని పెద్దకొడుకు మధుఁడు అతని వంశమునఁ బుట్టినవాఁడు.

(3) శత్రువులఁ గంపింపఁజేయువాఁడు

10 స్వభూః — తనంతట దానే పుట్టినవాఁడు

11 దైత్యారి — దైత్యులకు శత్రువు

12 పుండరీకాక్షః — తెల్లదామరవంటి కన్నులుగలవాఁడు

13 గోవిందః — భూమినిగాని, గోవునుగాని, స్వర్గమునుగాని, వేదమునుగాని, పొందెడువాఁడు.

14 గరుడధ్వజః — గరుత్మంతుఁడే ధ్వజముగాగలవాఁడు

15 పీతాంబరః — పచ్చని బట్టగలవాఁడు

16 అచ్యుతః — తనచోటునుండి భ్రంశము పొందనివాఁడు

17 శార్ఙ్గి — శార్ఙ్గమనెడి విల్లుగలవాఁడు

18 విష్వక్సేనః — అంతటవ్యాపించిన సేనగలవాఁడు

19 జనార్దనః — (1) సముద్రమధ్యమున నుండు జనులను నసురులఁ బీడించువాఁడు

(2) ప్రళయకాలమున జనులను బీడించువాఁడు.

20 ఉపేంద్రః — (1) ఇంద్రునకు దమ్ముడు
(2) ఇంద్రుని రక్షించుటకై యతనియొద్దనున్నవాడు
(3) ఇంద్రలోకముకంటె పైలోకమునందుండువాడు

21 ఇంద్రావరజః — ఇంద్రునకు దమ్ముడు

22 చక్రపాణిః — చక్రము హస్తమునందుగలవాడు

23 చతుర్భుజః — నాలుగు చేతులుగలవాడు.

24 పద్మనాభః — పద్మము నాభియందుగలవాడు.

25 మధురిపుః — మధువనెడి రాక్షసునకు శత్రువు.

26 వాసుదేవః — (1) వసుదేవుని కుమారుడు.
(2) అంతట వ్యాపించినవాడు.

27 త్రివిక్రమః — బలిబంధన కాలమున మూడులోకములను మూడడుగులచే గప్పినవాడు.

28 దేవకీనందనః — దేవకీదేవి సుతుడు.

29 శౌరిః — శూరునియొక్క మనుమడు.

30 శ్రీపతిః — లక్ష్మీదేవికి భర్త.

31 పురుషోత్తమః — పురుషులయందుత్తముడు.

32 వనమాలీ — పాదములవఱకు వ్రేలెడుపుష్పమాలిక గలవాడు

33 బలిధ్వంసీ — బలినణచినవాడు.

34 కంసారాతిః — కంసునిశత్రువు.

35 అధోక్షజః — (1) ఇంద్రియముల నధఃకరించి జనించినవాడు
(2) జితేంద్రియులకు ప్రత్యక్షమగువాడు.

36 విశ్వంభరః — విశ్వమును భరించినవాడు.

37 కైటభజిత్ — కైటభుడనె దనుజుని జయించినవాడు.

38 విధుః — శత్రువులను వ్యధపెట్టినవాడు.

39 శ్రీవత్సలాంఛనః-శ్రీవత్సమనెడు మచ్చగుఱుతుగాగలవాడు.

ఈపోతన కవీంద్రునివిషయమై చిత్రచరిత్రములనేకములు గలవు. అవి యదార్థములైనను గాకున్నను రసవంతముగానుండునని వ్రాయుచుంటిని.

శ్రీనాథకవి తనబావమఱఁది యెన్ని తెఱంగుల జెప్పినను తాను వ్రాసినపుస్తకమునంకితమిచ్చి తనదారిద్ర్యము బాపుకొనలేకపోయెనని యు నాతని నెవ్విధంబు నైన నరకృతినిడుటకు సమ్మతింపఁ జేయవలయు ననియు నెంచి కొంతపరివారముతో వివాహమున కేత్తాపునకో పోవుచున్న వారలవలె నేకశిలానగరంబునకుజని బావమఱదిగాంచిన నాతఁడు వారలఁజూచి యర్ఘ్యపాద్యాదివిధుల బూజించి యుచితాసనములనిచ్చి మఱలతన దేవతామందిరంబునకఱిగి నిష్ఠాగరిష్ఠుఁడై భాగవతమును రచియించుచుండ నాతనిభార్యయేతెంచి భర్తనుగాంచి గృహంబున తగుసంబారములేవియు లేవనియు నీదినంబున బందుగులెందరో వచ్చియుండిరనియు దెలుప నాతండు గృహంబున నేపదార్థములును లేకుండుటకు మనంబున దిగులొంది యెద్దియును దోచక తాను వ్రాయుచున్న భాగవతముగల తాళపత్రంబులపై తనఘంటముతో నెద్దియో యాలోచించుచుఁ బొరపాటునబొడచి యెవరి నైన నాశ్రయించి గృహమునకుఁగావలసిన వస్తునికరముల దేవలయునని రామస్మరణ మొనర్చుచు నాపురిఁగల యొకధనవంతుని గృహంబున కరిగెను.

తనకలిమిజూచుకొని మిట్టపడు లుబ్ధాగ్రేశ్వర చక్రవర్తులకు దీనజనరక్షణము, పండితపాలనము, ఆశ్రితరక్షణము, సద్వినియోగచింతనము, సదాచార సాంప్రదాయములు, పుణ్యపాపములు, దానధర్మములు, ధర్మాధర్మములు, భక్తివైరాగ్యములు, శృతిస్మృతులు, కావలయునా! ఎంతకాలమును బ్రపంచకమంతయు నార్జించవలయునను గోరికమేరమీరియుండును. అసలు పర్వతముల నదుల సముద్రముల నంతరిక్షమార్గముల దాటునుగాని కాళ్లు గడపలు దాటనట్లు వారలెం

తయాచించిన వొకనికి నేజన్మమునైన నిచ్చియుండినగాని తనకీజన్మమున సంపదగలుగదు. ఈజన్మమున బెట్టిన ముందుజన్మమున గలుగునని పెద్దలు నుడివెదరు.

శ్లో॥ అదానదోషేణభవద్దరిద్రో
దరిద్రదోషేణకరోతిపాపం
పాపాదవశ్యః పునర్దరిద్రో
పునర్దరిద్రో పునరేవపాపి॥

అనగా తానొకరికి బెట్టనియెడల దరిద్రుడు కాగలడనియు దరిద్రుడైనందువలన పాపకృత్యములు సలుపవలయుననియు పాపకృత్యములు సలిపినందువలన దరిద్రుడై పుట్టవలయుననియు దరిద్రుడై పుట్టి పాపములసల్పవలయుననెడి నీతిశాస్త్రమునుసరించి యొకరికి తాబెట్టి యనుభవించినవాని దేజన్మ. లేనియడల మధుమక్షికములు పుష్పరసమును సంపాదించి చెట్లతొఱ్ఱలనుంచి తామనుభవింపక నొరులకుబెట్టక నెలుగులకునొప్పగించిన లుబ్ధుని ద్రవ్యము భూపాలునికట్లుజేరును. ఆకాలమునసుండిన ద్రవ్యవంతులిప్పటివారలవలె మితిమీరిన లుబ్ధత్వమున నుండెడివారుకారు. కొంచెమైన ధర్మాధర్మముల విచారించెడివారని పెద్దలవలన దెలియుచున్నది.

పోతనామాత్యుడా లక్ష్మీపుత్రునిగని "నాయనా! నాగృహంబునకు బందుగులువచ్చి యున్నవారలు వారుశతమునకు మించియుండిరి. పేదవాడనుగనుక బ్రాహ్మణసమారాధనానిరోధము గానీయక తగుసంభారములనన్నిటిని నీవిచ్చినచో నీఋణముఁ గొలది దినంబులలోఁ దీర్చికొనియెదననుమాటల నాభాగ్యవంతుడాలించి "సరిలెండు సొమ్మునకేమి ? మాసేవకుడు కొలదిఘడియలలోవచ్చును. అతడు వచ్చినపిదప మీకుకావలసినవన్నియుఁ గొనిపొండన పోతన కాలాతీతమునకు మనంబున మిగులబాగలుచు నేడెటుగౌరవము దక్కగలదో

గదా! భోజనకాలమాసన్నమైనది. ఇంతవఱకునేమియు నింటిలోఁబా కసన్నాహములు జరుగుచుండవుగదా! నన్నెటులైన వంచనమొనర్ప నెంచిననాబవమఱదికి లోకవజిక్కును. పేదతనముపూర్తిగ వెల్లడి యగును. నరకృతినిచ్చి యీపేదఱికము మాన్పుకొనరాదాయని పలు మరు పదుగురిలోనన్ను దూషించునుకాబోలు దైవమా! నేనేమిచే యుదు నాపాలిటిపరాత్పరుండా శ్రీరామమూర్తి, ఆశ్రితజనవత్సలుడు దుష్టశిక్షణశిష్టరక్షణదక్షుండు, రఘుకుల క్షీరకూపారరాకాకరుడు, సీ తాముఖసరోజవిభాకరుడు. పితృవాక్యపరిపాలితుడు, మునిజనరక్షితు డు, దనుజశిక్షకుడు, రావణసంహారకుడు, విభీషణవరదుడు, లక్ష్మణా గ్రజుడు, శ్రీరాముడే నాకీ విపత్తునుండి రక్షించువాడని నిమీలితలోచ నుడై పరమేశ్వరధ్యాన మొనర్చుచుండె

భక్తవత్సలుఁడగు శ్రీరాముడు తన భక్తునకు నేడు పరాభ వము శ్రీనాథుని వలన గలుగుచున్నదని శ్రీరాముండనుజసీతా సమ న్వితుఁడై యుప్పరివాండ్రరూపంబుల దగు సంభారములగొని పోయి పోతన గృహంబునఁజేర్చి పెద్దపెట్టున రోదనము సేయుచుండ పోతన తల్లి లక్కమాంబ దయార్ద్ర దృష్టితో మాయామానవరూపులని యెరుంగ జాలక "ఏమిరా! వాపోవుచుంటివిన నా పెద్ద యుప్పరి వేసంబునన్నున్న శ్రీరాముఁడు తన వీపుజూప నచ్చట మూడుతాళ్ళల రక్తము స్రవించు చుండుట కచ్చెరువొంది లక్కమాంబఁ అదేమిరా" యన నాతఁడు వెక్కి వెక్కి యేడ్చుచు "అమ్మా! సంబారముల నెట్టి యింటినుండి మమ్ము గొంపోవలసినదిగా బోతయ్యగారాజ్ఞయిన నాసరకులగొని వచ్చుట కించుకంతతడవొనరించిన మమ్ముమ్మల నీగతి కోపించి శిక్షించి రనుటయు నా పెవిని మనంబున తన సుతుడట్లొనర్చునాయని వితర్కిం పక నేమో యెట్టివారైన నరిషడ్వర్గములకు లోనయి తమతము సద్భా వంబుల వదలినవారలు లేరా! యని మనంబున నిశ్చయించుకొనిఁ

సరిలెమ్ము నాయనా! నాసుతుని మోదలించెదను. ఒళ్లెరుంగక నిట్టి దెబ్బలగొట్టినాడుగదా! యని పలుమరువగచి వారల సాగనంపె. తదుపరి వారదృశ్యులైరి చనిరి. గృహమున వంటలు సర్వమును సిద్ధమగుచునుండె.

రెండు యామములు దాటినపిదప సెట్టి వలయు సామగ్రినిచ్చి పోతన నంప నేమియు దెలియక నాసలఱులగొని పోతన గృహమున కరుదెంచె. గృహమున సర్వమును సంసిద్ధమగుటయు నీతనికై యందరెదురుగాంచు చుండుటయు పోతన గని యత్యాశ్చర్యకలిత హృదయారవిందుఁడై తల్లినిగని రహస్యంబునఁ పదార్థము లెటనుండివచ్చిన వని? నాపై తనయునిగని నిలుపరానికోపంబునఁ నీవెంతయో సజ్జనుడవనియు జితేంద్రియుడవనియు మిక్కిలి సంతసించుచుంటిని కాని నీవిట్టి నిర్దయ మనస్కుఁడవని తలఁపనైతి” నవుడు పోతన “తల్లీ నే నొర్చని నిర్దయకృత్యమేది కలదు? తెలిసినేనేమియు దోసపుపని గావించలేదు. అజ్ఞాన వశంబున నేదియైన గావించిన క్షమింపవలయును. అట్టిదియైన నే నొనర్చితిననియు జెప్పలేనన్న “చాలు! చాలు! నీవు దోసమొనరించుటయేకాక జమునిభంగి సూనృతము వదలితివా! నీకింత కండకావరమా! దీనులపై నింత నిర్దయయా!” యని పోతనను లక్కమాంబ పలుమరు నిందింపుచుండ ‘అమ్మా. యెందులకీ ములుకులవంటి పలుకుల నామనసు నొప్పించెదవు. మనో వాక్కాయ కర్మలచే నేనెట్టి దోసము జేయులేదని నొక్కి వక్కాణించగలను నీవెరింగిన దేదియో నాపై దయయుంచి తెలుపుమన నాపై కోపము నొక్కింత శాంత పఱచుకొని “నీవు సెట్టిగృహంబునుండి సరుకుల నుప్పర వాండ్రచే దెప్పించితివా? వారల నేమిచేసితివి?”

“తల్లీ! నేనిప్పుడే సెట్టిగృహంబునుండి యాతనసేవకులచే బట్టించుకొనివచ్చితి. ఉప్పరులెవరో నేనెరుగ వారలమొగములైన నే జూడలేదు వారలచే నేనెడ పదార్థముల బంపుటేడ అంతయుఁగల్ల.

“ ఏమిచిత్రము ! నీవెరుగననుచుంటివి నీవునిర్దయతో వారల బడిమోదితివనియు నందొకని వీపునగల రక్తసిక్తమగు గాయముల మూటిని నాకుఁజూపి మిగులఁ నేడ్చిరి. నీవింతజడుడవైతివని మిగుల వగచి నే నిప్పుడు నిన్నడుగ సాహసించితి”

“ తల్లీ ! నీపాదముల సాక్షిగా నాయిష్టదైవమగు రామపాదారవిందములసాక్షిగా నే నేదోసంబు నెరుగ” నని మిక్కిలి విచారించి యదియంతయు భగవన్మాయగా నున్నయదియని తల్లిపాదముల బట్టుకొని నీవుధన్యురాలవు. భగవంతుఁడు నీకట్టివిధమున సాక్షాత్కరించె. లేకున్న నాసంబారముల నేజంపియుండ లేదు. ఇది యంతయు దప్పక నీశ్వరవిలాసముగ నే యున్నది నీయార్తత్రాణపరాయణుఁడగు శ్రీమన్నారాయణుని దివ్యసుందరవిగ్రహము జూడ నోచుకొంటివి. నేపాపాత్ముఁడ నాకట్టి భాగ్యములేదని మిగులవగచి కాలాతీతమైనందున భోజనమునకు బంధువర్గముతో లేచి దేవతారాధన పీఠము కడకుజని యథావిధిగా బూజించి నివేదన మొనర్చినపిదప నాపుస్తకముల నెప్పటితావున బెట్టునవసరమున తానువ్రాయుగ్రంధమున మూడు రక్తబిందువులును అందు మూఁడురంధ్రములును గాంచి నివ్వెర గొంది గతంబంతయు దర్శించి తల్లి నుడివిన వృత్తాంతంబునకు నిందుమూఁడు రక్తబిందువులుండుటకు నప్పటికి మూడుగాయముల జూపుటకు బాగుగా సరిపోయినదని శ్రీరామచంద్రుడే భక్తసంరక్షణార్థము వచ్చెనని యోచన మెద్దియుదోచక నందు తాఁగుచ్చిన గంటపు పోటులు నేరస్థాపన మొనరించి శ్రీరామమూర్తి తల్లికి నివేదించెనని యుగ్రహించి జరిగినవృత్తాంతమునంతయు భోజనకాలమున బంధుగుల సమక్షమున మాతకు నివేదించె. వినినవారందరు నాశ్చర్యముగలవారైరి. శ్రీనాథుడు బావమఱఁదిని వంచింపదలచిన దలపులు విఫలములై వచ్చినదారిని తన నగరంబునకు సపరివారంబుతో నరిగె.

ఏమి పరమేశ్వరుని విలాసము. భక్తవశీకరుడను మాట పైన జెప్పబడిన చరిత్రములవలన యదార్థమని యనవచ్చుగదా భక్తవిజయ మందు భగవంతుడు భక్తులకుఁ దోడునీడయై సంచరించిన గాథల జదువలేదా! భక్తవిజయమునగల నొకచరిత్ర మిందుపొందుపఱచెద. ఏలయనిన? పరాత్పరుడు భక్తులవెంట నంటియుండి కార్యముల నేర వేర్చునని తార్కాణముగా నుండునని యూహించితిని.

పరమేశ్వరుడు భక్తులవెంబడి "గోవు వెంటదగులుకోడెభంగి" సంచరించుచుండు.

---

# పురందరోపాఖ్యానము

---

పండరినగరి బూర్వము పురందరుడను ధనికుడు లుబ్ధాగ్రగణ్యుడై యుండెడివాడు ఆతనిభార్య మిక్కిలి పతివ్రతయై అన్నులమిన్నయై అర్థిజనపారిజాతమై యుండె ఒకదినంబున పండరినాధుడు (శౌరీ) వృద్ధబ్రాహ్మణవేషధారియై పురందరుని జెంతకేగి తనకుమారునకు వివాహము జరుగనైయున్నది కాన గొంతసొమ్ము నిమ్మని యాచింప నాతఁడు నిరాకరించి వెలుపలికి బొమ్మని వెడలగొట్టగా నాతడు గృహమున లేనిసమయముజూచి యిలుసొచ్చి ఆమెనుగని ,అమ్మా! కుమారునివివాహనిమిత్తార్థమై ద్రవ్యసహాయమునకు యాచింప వచ్చితి నననాపెకనువగచి చేతునదేమియు లేక ,,అయ్యా! మీదర్శనము నాకుదామోదరుదర్శనతుల్యము య్యె దీనులజూచి నేనొసగు స్వల్పదానమునకే నాపతి గినిసి నాకొకవస్తువైన నీయక సర్వము తనయధీనము జేసికొనియె, ఈ ముక్కెరతక్క భవదీయుచరణ యుగళములసాక్షిగా నాయొద్దనేమియు లేదు. మఱియుబ్రతిదినసమున

వంటకు సమస్తముఁగొలచియు లెక్కించియు బంపు ఇట్టినిర్భాగ్యపుదశ నున్న నేనుచేయునదేమియు లేదైననీముక్కెరతో బ్రయోజనముండిన నిచ్చెదనన పండరినాథుఁడు 'అమ్మా, అయ్యది రత్నములు స్థాపించిన ముక్కెరఅయ్యదియైన సామాన్యమా దానితో నాకుమారుని వివాహమహోత్సవముగునని నుడువ నాపెం దీవిస్ర్గామంబున నెచ్చటయు జూపక నన్యగ్రామంబున విక్రయించుకొనుమనిన నాతండు 'వల్లే యన' నాపెముక్కెరనిడదానింగొని పురందరుని కడకేగి ముక్కెరనిడి కొంతసొమ్మిమ్మనిన నాతడు వల్లెయనిపల్కి మనంబున నయ్యది దనభార్యయొక్క నాసామణిగా నెంచి గృహంబున కరిగి భార్యను ముక్కెర నిమ్మని యడుగ నాపెమనంబున దిగులొంది యిది హాని కృత్యముగా నెరింగి పరమేశ్వరుని మనంబున దలచి జలఘటమున బెట్టితినని హస్తమందిడ నాసామణియొకటి పరమేశ్వరు కరుణవలన లభింప భర్తకు నిడ పురందరుండు చేతగలిగిన నాసామణికిని భార్య యిడిన దానికిని తారతమ్యము లేకుండుట కాశ్చర్యమొందుచుండ భార్య కతంబంతయు దెలుప పురందరుడా మాయావిప్రునికై యెదురు చూడ నాతండు దృశ్యుడు కానందున భక్తివైరాగ్యములుప్పతిల్ల తీర్థ సేవలకరగి ద్రవ్యము వెచ్చించుచుండ పురందరుని సుత యత్తవారింటికడ ప్రథమరజస్వలైనందున నచ్చట జరుగు శుభకార్యముల పురందరాకృతిని పండరినాథుడే జరుప పురందరుఁడు గృహంబున కరుదెంచి గతంబంతయుదెలసి బ్రాహ్మణసంతర్పణ మొనర్చుచుండె దైవబలము లేనివాడే దుర్బలుడుగదా.

"శ్లో॥ నేతాయస్య బృహస్పతిః ప్రహరణం వజ్రంసురాఃసైనికాః
స్వర్గోదుర్గమనుగ్రహః ఖలుహరేరైరావణో వారణః
ఇత్యాశ్చర్య బలాన్వితోఽపిబలభిద్భగ్నః పరైః సఙ్గరే
తద్వ్యక్తం నను దైవమేవశరణం ధిగ్ధిగ్ వృథాపౌరుషమ్॥

తా. బృహస్పతి గురువై వజ్రమాయుధమై దేవతలు సేనలోనివారలయి స్వర్గముకోటయయి విష్ణుమూర్తి యనుగ్రహముగలవాఁడై ఐరావతగజంబు గల్గిన యింద్రుడే శత్రువులచే యుద్ధమునం దోటువడెను. కావున దైవబలమే ప్రధానముకాని పౌరుషమెందులకును బనికిరాదు.

పురందరుఁ డొనర్చుచున్న సంతర్పణమునకు నేతికొఱకప్పరాయుఁడను నాతని బజారునకంప నాతఁడేగి నేతినిగొని వచ్చుచుండ పండరి నాథుండు మార్గంబున హాస్సీలు మెట్టు కల్పించి యొక్క అణా సుంక మిమ్మని యడుగ నాతండు లేదనిన మఱల నేగి సుంకమీయవలసిన డబ్బు దీసికొనిరమ్మన నాతఁడా ఘృతపాత్రనందునిచి డబ్బులకై వర్తకుని యొద్దకరుగ నాభక్తవత్సలుఁడగు హరి అప్పరాయుని రూపంబు వ్యాఘృతపాత్ర నెత్తినిడికొని కొంపోయి పురందరునకీయ నాతఁడద్దానిఁగొని బ్రాహ్మణ సంతర్పణము యధావిధిగా నొనరించె. పురందరుఁడు శ్రీహరిని తెలియనేరక అప్పరాయా! హస్తప్రక్షాళనమునకు జలము దెమ్మన పండరి నాథుండు జలమునుగొనివచ్చి పురందరుని హస్తములపై బోయ నవ్వానిబిందువులు చెదరి పురందరుని గాత్రమున బడుట కించుక కనలి అప్పరాయ రూపంబుననున్న దామోదరుని శిరంబుపై మొత్తగా నభక్తవశంకరుండు మనంబునఁ వచ్చినందులకీ యనుభవమయ్యె! నని చింతించియరిగె నాటిరేయి హరిదేవళంబునగల స్వర్ణకంకణమునుదీసికొని పురందరు రూపంబునఁ గలవాణియను వేశ్యాంగన యింటికఱిగి దానింజూచి కపటమోహమున స్మరసమర మొనర్ప రమ్మన నా కలవాణి యాతనింగని కపట దాసుడనియెఱుంగకఁ తమ వంటి వారలిటు మోహాంధకార నిమగ్నులై సంచరించిన నికజ్ఞానుల కేదిదారి? హరినామసుధారసంబుకన్న నాయధరపీయూష మెక్కువ యగునా? కటకటా! యిదివినజనులు నగరా! స్వర్గసుఖమున కీక్ష

త్యము భంగముకాదా! మీకేల యీకోర్కె నన్ను క్షమింపుడ'ని ప్రార్థింప పురందర వేషధారియైన శౌరిః ఓసిపిచ్చిదానా! నీ వెరుగవు నేనెంత భగవద్ధ్యాన పరాయణుడనైనను కామమునకేమి? నేను నిన్నుగనినతోడనే మనము చలించినదన మోహవాక్కుల బ్రొద్దు పుచ్చి కార్యంబుగానక కలవాణిపజ్జ నొరులెరుంగకుండ కంకణముంచి మెల్లగచని యదృశ్యుండయ్యె మరునాడుదయమున కలవాణి యాకంకణముగని యాశ్చర్యముఁబొందె. అర్చకుడు దేవళంబునకరిగి పరమేశుని కంకణము లేకుండుటకు భయమొంది ప్రభువునకుఁదెలుప నాతడుపట్టణమున "దేవునికంకణమెవరికైన దొరికినయెడల వారలుదెల్పి యిచ్చినవారలకు బహుమతినీయబడు" నని పీటజాటబంప నాడు కలవాణి తన ప్రక్కగల కంకణమునకై విచారించుచు నయ్యదిగొని దొరచెంతకఱిగి కంకణముసమర్పించి పురందరుడు నిన్నటిరేయి నాగృహంబునకు వచ్చి రతికేళిగూడుమని నన్నుబలాత్కరింప నేనొల్లకయుంటిని. అతండు నేనెరుగకుండగ నీకంకణమునా చేతనుంచిచనె. నేనుదీనినిగాంచి మిక్కిలిపరితపించుచుంటిని. నాపుణ్యవశమున నీచాటింపునాకువినబడి పరాత్మునికంకణముగా నెరిగి మీసన్నిధికి తీసుకొనివచ్చితినన నధిపతిపురంధరుడిట్టి కృత్యమునొనరించెనాయని మిక్కిలిసందియమునొంది పురందరునిరప్పింప సేవకులనంపెను. సేవకులందరు నిర్మల వైరాగ్య ప్రవర్తనముగల్గిన నళిననాభుని దేవళంబున భజనసల్పు పురందరదాసున వలోకించి దొరగారియాజ్ఞదెలుప నాతండధిపతి చెంతకరుదేర నృపతి గారవించక కడియంబేమిచేసితివనియడుగ వలయంబేమో నేనెరుగనను భక్తునివచనంబులువిని నృపాలుడు కలవాణినిజూచి "ఓ వెలకాంతా! ఈతడు ఫణిరాజశయనుని వలయము నెరుంగడట" యనినుడువ నా కలవాణి పురందరు నవలోకించి భక్తాగ్రగణ్యా!

శ్లో॥ ప్రాణాఘాతాన్నివృత్తిః పరధనహరణేసంయమఃసత్యవాక్యం
కాలేశక్త్యాప్రదానంయువతి జనకథామూకభావః పరేషామ్

కృష్ణాప్రోత్తోహి భంగో గురుషుచవినయః సర్వభూతానుకమ్పా
సామాన్యం సర్వశాస్త్రేష్వనుపహతవిధిః శ్రేయసామేషపన్థాః

తా॥ జీవహింసలవిడచి పరుల ద్రవ్యమునందు మనసుబోనీక సత్యముబలుకుచు దేశకాలములెఱింగి శక్తికొలది దానముచేయుచుఁ బరస్త్రీలవిషయమునుగుఱించి ఏమియుబలుకక మౌనమువహించి అత్యాశనుఁదిపి గురువులయందు వినయమునుగనబఱచుచు సకలప్రాణులందు దయనుగనబరచుట శ్రేయమునుగలుగఁజేయునని సకలశాస్త్రములందున సుప్రసిద్ధము.

సజ్జనులకట్టి లక్షణములుండవలయును మీరునిన్నరేయి నామందిరమునకరుగుదెంచి స్మరవేదన నొందుచుంటినని నన్నునేకవిధంబుల బలవంతమొనర్పలేదా! ఎంతటికిని నేనొల్లకుండుటచేసిచేతనున్నమీకడియము నేనెఱుగకుండ నాయొద్దనీవుంచలేదా! అనృతమేలపల్కెదవు అనృతముపల్కిన మహాదోషమని చెప్పుటయేకాని యాచరించుట కాదా! యనిగర్జించినట్లు పలుకు వేశ్యాంగనవచనములవిని తెల్లబోవుచు నే నేడ నిన్నటి రేయి నీగృహమునకువచ్చుటేడ? హరి! హరి! నిన్నురమ్మని కోరుటేల? ఇంతటిదోషకార్యముల కేలనొడిగట్టెదు! భగవంతుడు లేడా! పుణ్యపాపములేవా! దివ్యజ్ఞులునశించెదరా! గోవింద! !గోవింద!! యనుచుండ కలఁవాణిఁ నృపసత్తమా! కపటదానుడెంత యనృతమాడుచుండెనతడు నాగృహంబునకే నిన్నటిరేయిరాకుంటినని పలుకుచున్నాడు మాయిరుగుపొరుగువారల రప్పించి కృతమంతయు నెఱింగి పురందరుడు నేరస్థుడనినమ్మి పదిదెబ్బలగొట్టుడనియాజ్ఞాపింప నావాని కింకరులొకచెట్టునకుగట్టి మూడుదెబ్బలుకొట్టినంత నంతనొకగొప్పశ్వాస పురజనులందరు నచ్చెరువొందునట్లు వినబడియె. అదెట్టిదనిన నేనుపురందరదాసవేషంబున సానియింటికేగి దానిపరపుక్రింద కంకణముదాచి వచ్చినానుగాన పురందరుడు పాపరహితుడుగాన బాధించుటమానుడు

సేవొనరించుటకుగారణమున్నదివినుము. ముసలిబ్రాహ్మణరూపమునజని యాతనితో లుదొ్త్త సూచింప లేదుపొమ్మనియెను. అంతటతనిభార్య నుజూచి ప్రార్థింప నాతి నా సామణినాకిచ్చె దానినీతనియొద్ద తాకట్టుపె ట్టిన తనభార్యవస్తువుగాదలచిమిక్కిలికోపమునబోయి పడతిమిన్ననుజూ చి నీదునాసామణియేదనిన? ఆమెమనంబుననన్నుదలచి జలఘటమున నుంచితినవిహస్తమందుంచ నేనందుకల్పించినట్టిముక్కఱనుదీసిదానిభర్త కునీయ దనజేతిలోనున్నదియు నిదియు నొకరూపముగానుండుటగని యాశ్చర్యమునొంది కృతంబుభార్యవలనవిని వైరాగ్యమున ద్రవ్యము బీదలకుబెట్టి యాత్రలుసేవింప నరుగునం తతనికూతురు పుష్పవతియైన దనినవార్తవిని పురందరరూపమునువహించి ఇతనివియ్యంకుని గేహ మునకుసేరికోరిన వేడుకలెల్లగావించియుంటిని.

తరువాత నీతడిలుసేరి సంతర్పణంబొనరింపదలప నేతనిముఖ్య శిష్యాకృతిబూని మస్తకముపైఘృతపాత్రధరించి దెచ్చియిచ్చియుంటిని ఈతడుహస్తప్రక్షాళన మొనరింప జీవనముదెమ్మనిబంప నేగొనివచ్చి ఈ తనిహస్తాబ్జములపైబోయుచుండ మేనబిందువులుపడుటకలిగి నానెత్తి మీాదసత్తువకొలంది కొట్టుటకు బదులు మూమ్మారీతని గొట్టింపవలయు నని యిట్లాచరించితిని” ఈతెరంగునవినబడిన నందరాశ్చర్యాయత్తచి త్తములు గలవారలై పురందరునిపాదంబులంబడి తప్పులక్షమింపుడని ప్రార్థించిరి,

ఇట్టిగాథలుపెక్కులు మనదేశమునందు జరిగియున్నవని భక్తవి జయమెసాక్షిగాబట్టి పోతనామాత్యునియింటికి పరాత్పరు డుప్పరియై వచ్చెనన్న కల్లగాదు.

---

# పోతనవిచారము

కొన్నిదినంబులు గతించినపిదప శ్రీనాధకవీంద్రుడు తన పట్టు కొనసాగించుకొనవలయునని దుస్తంత్రములచేఁ గార్యముఁగాసక స్వయముగాఁజని పోతన్ననుగనిఁ నీవుతప్పక నృపతులకేదైన నీభాగవతము నంకితమీయవలసినదని నొక్కివక్కాణించెను.

పోతన తనమనంబున నయయో! ఇదియేమివృత్తాంతము? నృపతులకీ భాగవతరాజము నంకితమీయుమని యితడు నిర్బంధించుచుండె నేనెటులొనరించుకొనిన నీతనికేమి? నేనీతఁడుభాగవతము రచించుచుంటినని కర్ణాటక ప్రభువునకుఁ జెప్పియుండనోపు. ఆతండిట్టులఁబంపియుండవలయు. ఆనృపుడరుదెంచి కృతినిమ్మన నేనెట్టులీయగడంగుదు. కృతినీయకున్న నేమిముప్పువాటిల్లునోకదా! అనిచింతించుచు నించుకతడవు కనులుమూసికొని భగవద్ధ్యానపరాయణుఁడైయుండ నాతనికట్టెదుర భారతి కన్నీళ్ళునింపుచు నిలచియుండుట పోతనకాంచి యాపె పద్మసంభవుని రాణిగానెఱింగి ఆపెఖేదనముసేయుటకుంగతంబూహించి తనయొక్కసందేహముగల విచారమే కారణమనుకొని యద్దేవింగాంచి యిట్లనియె.

ఉ॥ కాటుకకంటినీరు చనుకట్టులపైఁబడ నేలనేడ్చెదో
కైటభరాజమర్దనుని గాదిలికోడల యోయమ్మ యో
హాటకగర్భురాణినిను నాకటికింగొనిపోయి యల్లకర్ణాటకిరాటకీచకులకమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ

అని పల్కి యామెనూరార్చి తనబావమఱందిని జూచి నాకుమేలొనర్పఁ జాలశ్రమనొందుచుంటివిగాని.

ఉ॥ బాలరసాలసాలనవ పల్లవకోమల కావ్యకన్యకన్
కూళలకిచ్చి యప్పడుపుకూడుభుజించుటకన్న సత్కవుల్
హాలికులైననేమిగహ నాంతరసీమలకందమూలకౌ
ద్దాలికులైననేమి నిజదారసుతోదర పోషణార్థమై

అని చెప్పి యాతనిబంపె. నాటనుండియు నరకృతియందు మిగులదోషముకలదని యెంచి యుండెను.

# కర్ణాటకాధీశ్వరుండు వచ్చుట.

శ్రీనాథుఁడు తాను పట్టినతలంపు నెరవేర్చుకొనన నెంచి కర్ణాటప్రభునకుగల వృత్తాంతమంతయు దెలిపి ఆతండు భాగవతంబు దలంచి తన మనంబున నివ్విధి చింతించె. ఎట్టులనైన పోతనామాత్యునొడంబఱచి భాగవతమునంకిత మొందవలయును. పరిక్షిన్మహీపాలుండు భాగవతము నాలించి ముక్తిగాంచిన చందంబున నేను భాగవతము గృతిబడసి ముక్తిగాంచెదగాక, యనియు నదెట్టుల సమకూడుననియు నాలోచించె తుదకిట్టులఁ దలంచె. శ్రీనాథకవీంద్రుని పలుకులు పోతన నిరశించినను నేనాపురంబునకుంజని కృతి నిమ్మని యడుగ నాతఁడొడబడక తిరస్కరించునా? బాగు! బాగు! నాకుసరగా యోచనదొఱకినదనుచుఁగయా వినోదార్థము చనిన తీరున బురంబునిర్గమించి యేకశిలా నగరమున కరిగె. ఏకశిలా నగరమునకు గొంతదవ్వున డేరాల నిర్మింపంజేసి యందుండి తనరాక పోతనామాత్యునకు జారుల వలన నెఱుంగజేసె.

ఆసమయంబునఁ బోతనామాత్యుఁ డు భాగవతంబున యజ్ఞవరాహావతారమును దెనిగించుచుండెను. భక్తవశకరుఁడగు నారాయణుఁడు పోతనతో నెల్లప్పుడు లీలావినోదంబుల నాతనికి దృశ్యముగాక జరుపుచుండును. పోతనవ్రాయుచుండెనదాని కనుగుణ్యముగా శ్రీహరి

...హాగూపంబున యాతని గృహప్రాంతమున విహరించుచుఁ గర్ణాట ...ని భటులరాకగాంచి వారలనడ్డగించి హుంకారధ్వనిత్రో ...యంబుఁ బెంచివారల నదల్చిన నారాజభటులు తమ యేకిమీని కడకేగి గతవృత్తాంతంబు నెరింగింప నాతండుగ్రుడై లేచి సేనలతో బోతనగృహంబు ముట్టడించి కిటిస్వామింగని సామాన్య సూకరంబని తలంచి పందికై యీవిధంబున పందలగతి భయ మొందనేల? చూడుడు. నే నిదేమడియించెదనని సేనల బురికొల్పుచు "పొడువుడు- కట్టుడు- కొట్టుండు- పట్టుడు-" అనుచు దానివెంటనంటె.

అంతనా సూకరంబు సక్రోధంబున పదునాల్గు భువనములు తృటిఁ గాల్వనెంచి మించిన యాభీల కాలాగ్ని జ్వాలా మాలికలుప్ప తిల్ల నయనంబుః ద్రిప్పుచు ధవళకాంతుల వెదజల్లు కోఱల మీటుచు వారినందరి తనకోపవీతిహోత్రునకు నింధనీభూతుల జేయందలంచి విజృంభించి దంతహతిని ప్రత్యర్థిచమూపతుల దునియలుగఁజేసి పొట్టలు చించి మించుచుండ యానృపుడుగని తనమనంబున నిట్లు వితర్కించె "ఏమీ! ఈయద్భుతము ఈసూకరంబొక్కటియె మదీయసైన్య నికాయము విదళించె నేనొక్కరుండ దీనిపనిచిక్కఁజేసెదనని పెంపెక్కు కోపమున ధిక్కరించుచు నలుదిక్కులను బరికించుచో నయ్యాది వరాహంబవారిత శౌర్యంబున దుల్యంబులేని సంచారము సల్పుచు వసుంధరబోరియగాఁ ద్రవ్వుచుఁ జెలరేగియుండుట నృపవరుడీక్షించి తన కన్నులు మిరుమిట్లుగొన శరీరంబు కంపింప మనము చలింప నిశ్చేష్టితుండయ్యె. ఇట్లుండ కొంతతడవునకు నృపవరుండు తన మాంద్యబుద్ధి వదలి గతంబంతయు బోతనామాత్యుని ప్రభావ ప్రకటితంబనియు అపరాధం బొనరించితిననియు బోతనామాత్యుని దనమనంబున నెంచి యపరాధ క్షమయని నమస్కరించె. అంత నావరాహంబు దృశ్య

కాదయ్యె. కర్ణాట ప్రభుడు పోతనామాత్యునికడకుంజని యా పాదారవిందములకు సాష్టాంగదండ ప్రణామంబులాచరించి "కర్ణా దేశాధిపాధముడ! రక్షింపుము!! రక్షింపుము!!" నావుడు పోతన [illegible] నిం గ్రుచ్చియెత్తి యాతని వృత్తాంతంబంతయు నడగి తెలసికొని క్షణ మాలోచించి భగవత్కృతంబనియెరింగి అవమానంబునకు వెరువకు మని యాపుడమితేని యోదార్చి యిట్లనియె.

రాజా! నీకు సర్వంబును భద్రింబగు మాధవచింతానామృత మున కాలంబు గడపుము. నావుడు కర్ణాటదేశాధీశ్వరుండు శ్రీహరిని తన హృత్పద్మంబున నిల్పి ధ్యానింపుచు నాగృహంబు వెడలె భగవ దనుగ్రహమువలన నాతని సేనయెప్పటియట్లుండ నాతండలఘుముదం బంది పోతన మహాత్మ్యమును దలచుచు నివ్వెరంగొందుచుం దన పురంబున కేగె.

## భగవద్దర్శనము.

తదనంతరము పోతనామాత్యుండు భగవద్భక్తియుండై చతు ర్థాది స్కంధంబుల దెనింగించి అష్టమస్కంధమున గజేంద్రమోక్షణము వ్రాయుచునందు ద్విరదేంద్రుడు మకరిచే గాసిహొంది వైకుంఠుని రక్షింపుమని బొబ్బలిడ నాపల్కులు వైకుంఠనాథుండాలించె ననుచో "అల వైకుంఠ పురంబులో నగరిలో నామూల" అనినుడివె. అంతట పోతన కేమియుదోచక యూరకుండె. తనకూతుంబిలచి తా వ్రాయు చున్న పొత్తము నాపెకిడి "ఇదేనచ్చెద"నని యొక నిర్జనప్రదేశంబునకు జని తొంటి వాక్యంబుమఱల మది నూహించుచుండె. ఇంటికడ పోతన యిష్టదైవంబు తద్రూపధారియైవచ్చి పోతన సుతనుబిల్చి పొత్తము తెప్పించి యందున్న యసంపూర్ణవాక్యంబుజూచి "సౌధంబునాపల" యని వ్రాసి దాని నాపెకొసంగి చనె.

పోతనామాత్యుఁడు బాగుగ యోచించి భగవంతుడు వ్రాసిన వ్రాతయే తనకును స్ఫురింప దొందరనింటికేతెంచి తన పొత్తముగొని యందు స్వమనోగోచరార్థంబుగని మిగుల వింతనొంది కూతునఁబిలచి "దీనియం దెవ్వరువ్రాసిరి?" అన నాపె నీవకదా! ఇంతకు మున్నిట కరుదెంచి వ్రాసియుంటివనిన కొమరిత పల్కులవిని కొంతతడవు విచారించి యీవిధఁబున ననియె "అమ్మా! నీపున్నెంబెంతయుఁ బొగడ దగినది నీకుగనబడిన నాస్వరూపధారుండాత్మారాముడగు రాముండు గాని నేనుగానని దెల్పి పశ్చాత్తప్తుండై తనవెంటనంటి తిరుగు ముకుందునకు మొ్రక్కి సంతసంబున నాపద్యంబుపవ్యమాణ విధంబున బూరించె.

మ. అలవైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు దా
పలమందార వనాంత రామృతసరః ప్రాంతేందుకాంతోపలో
త్పల పర్యంక రమా వినోదియగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రముపాహి! పాహి! యనఁగుయ్యాలించి సంరంభియై

## శ్రీనాథుని యధిక్షేపణము

కొంతికాలంబునకు శ్రీనాథుఁడొకదినంబున మఱలవచ్చి పోతన వ్రాసిన యష్టమస్కంధమునుజూచి యందున

మ. సిరికింజెప్పడు శంఖచక్రయుగముజ్జేదోయిసంధింపడే
పరివారంబును జీరడభ్రగపతింబన్నింపడాకర్ణికాం
తరధమ్మిల్లము చక్కనొత్తడు వివాదప్రోద్ధతశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడుగజప్రాణావనోత్సాహియై.

అనుపద్దెమునుజూచి పోతన్ననుబిలచి, బావా! ఈపద్యము నామదికి సమ్మతముగా లేదేమనిః? శ్రీమహావిష్ణువు సిరికిం జెప్పకశంఖచక్రముల బట్టక తక్కుంగల సాధనముల ముట్టక ఖగపతి నెక్కక యూరక

గజేంద్రుని రక్షింపనరిగెనా? ఆతండు భక్తునియవస్థగనఁ జనుదెంచెనా? భక్తుని స్థితిఁజూచి తదుపరి పరికరముల గొననెంచెనా? యనుచువికవిక నవ్వె అంత బోతనయిట్లనియె. భక్తవశంకరుడగు పురుషోత్తముం డట్లుపరితాపమునొందుట భక్తులయెడల దనకున్నట్టి దయఁజూపుట యనియేనాతలంపు. అయ్యదిసహేతుకముగా నుండకున్న నేమిచేయ గలను. నాయభిప్రాయమును లోకానుభవమువలన వెల్లడించితిననుడు శ్రీనాథుండూరకయుండె.

పోతన శ్రీనాథుఁడాడిన వాడిమాటలనెదనోర్వలేక యదార్థం బాతనికి గోచరంబగునట్లొనరింపనెంచి సమయమున కెదురుచూచు చుండెను.

ఒకదినంబున బోతన శ్రీనాథునికొమరుకొకని గూఢస్థలము నందుదాచి యొక పెద్దఱాతినిగొని నూతిలోఁ బారవైచి త్వరితంబుగ గృహములోనికిఁ బరుగిడివచ్చి ,బావా! ఇకేమిగలదు, నీకొమరుండు దుడుకుతనంబున మననొడ్డిలోగల నేలమట్టమువనున్న నూతిదాపున నాడియాడి నూతిలో గుభాలునఁ గూలినాడఁ. గద్గదకంఠముతోఁ బల్కు పోతనపల్కులవిని యొడలుకంపింప పదముల తడబడ కన్నీరు మున్నీరుగా స్రవింప ,ఎచ్చట, ఎచ్చట, నని రిక్తహస్తములతోఁ బరు వెత్తునా పుత్రశోకజనితాకులభారవిషణ్ణచిత్తుని బోతనకని ,బావా! నిలు! నిలు! నూతికడకూరకబోయి పడినబాలుని యవస్థఁజూడనెంచి తివా! బాలుని సంరక్షింపనెంచితివా! అటులసంరక్షింపనేగు నీకు తగినపరికరములులేకుండిన బాలునినెట్లుకావగలవు అనుచునిర్బం ధించు పోతనతో శ్రీనాథుడు బావా! నాకుమారుని నాకులవర్ధనుని నాచిన్నారిపాపను, నాయయ్యను జూడనిమ్ము చూడనిమ్మ నన్నిట్లేల నాపెదవని వెక్కివెక్కియేడ్చుచున్న కవివరేణ్యునిఁజూచి పోతన నవ్వుచు బావా! నీకుమారునికై విచారమునొందకుము. నీవునన్నడిగి

న పశ్నమున కుత్తరువునిచ్చితిని. నీకెంతపుత్రవాత్సల్యమువలన నీకు విచారము తలిగినదో శ్రీమన్నారాయణునకు నట్టివిచారమేకావ భక్తుడగు గజేంద్రుడు పశు బాములగన రిక్తహస్తములతోనరిగెననివ్రాసితి నివు నీకుమరుని బ్రతికింప నసమర్థుండయ్యు నీవిట్లుపరికరరహితుడవై కుమరుని రక్షింపనెంచితివికదా, సమర్థుడగు శ్రీనాథుడరిగెనననేమి లోపము. నీవుభాగవతము నిరశించి భగవంతునియెడ వాగపరాధంబొనరించితివి కావున బశ్చాత్తప్తుడవై యాహరిశరణంబు వేడుము నీకుమరుడు కుశలుడై యుండెనని నిజనివాసంబున శ్రీనాథుని సుతునిజూపిన నాతండంతదనలోపమునకు సమ్మతించి సుఖంబున దనపురంబున కరుగనెంచి యింతటిభాగవతము గృతినిచ్చినచో బాగుగానుండుననిమనంబుననెంచి యాతని బ్రతిమాలె. పోతన శ్రీనాథునిగని

ఉ. బాలరసాలసాల నవపల్లవకోమల కావ్యకన్యకన్
కూళలకిచ్చి యాపడుపుకూడు భుజించుటకన్నసత్కవుల్
హాలికులైననేమి గహనాంతరసీమల గందమూలకౌ
ద్దాలికులైననేమి ? నిజదారసుతోదరపోషణార్థమై.

శ్రీనాథుండాపల్కులవిని కొన్నిదినంబులా యూరనుండి సకుటుంబముగా నిజవాసంబునకరిగె. పోతన్నామాత్యుడు నరాంకితమొనర్పకని తన భాగవతమునందుదహరించె.

ఉ. ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుగొన్నిపుచ్చుకొని సొక్కి శరీరము వాసికాలుచే
సమ్మెటపోటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్.

ఈపద్యమునుబట్టిచూడ బోతరాజు నరకృతిని షేధించినట్లు స్పష్టమే

యగు కాని దీనికిబూర్వమునందో పరమునందో శ్రీవెంకటగిరిపతియగు సర్వజ్ఞసింగమనీని వాంఛానుసారముగా నొకదండకము నాతనికి గృతి నిచ్చియుండెననియుంగలదు. ఆకృతి భాగవతమురచించుటకు బూర్వ మునందే యయియుండవలయును.

భోగినీదండకముచివర నీక్రిందివిధమున బద్యముకలదని చరిత్ర కారులు ప్రకటించిరి.

ఉ॥ పండితకీర్తనీయుడగు బమ్మెరపోతనయాసుధాంశుమా
ర్తాండకులాచలంబునిధి తారకమైవిలసిల్ల భోగినీ
దండకమున్ రచించె బహుదానవిరక్తుకు రావుసింగభూ
మండలభర్తకున్ విమతమానవనాథమదాపహర్తకున్.

---

# పోతన భాగవతము శిథిల మగుటకు గారణము

రావుసింగభూపాలుండు భాగవతము తనకంకితమీయవలసినదిగా గోరి పోతనామాత్యుని రప్పింప నీకవివర్యుండు కృతినీయనని నిరాకరింప భూవరుండాగ్రహోయత్తచిత్తుండై కవివర్యుని జేతగలభాగవతమును బ లవంతమున గైకొని భూమిలో బాతిపెట్టించె. దానంజేసి పోతనమిగుల చింతాక్రాంతుండై తనయిష్టదైవమునుగుఱించి ప్రార్థించుచుం జేయు నదేమియులేక గృహంబునకరగి కొంతకాలంబునకు బరమపదవి జెందెను.

ఆహా! నృపవరుని దౌర్జన్యము. సకలకవివరుల సంరక్షించు భూభర్తయే యీవిధమున జేయనొడిగట్ట రక్షకులెవ్వరు?

నృపతినాశ్రయింపక స్వతంత్రముగా జీవనముఁ గడపుచున్న యీకవివీరుఁడు రచించినగ్రంథము తనకంకితమీయలేదను ద్వేషంబున నెంతపనిజేసెననియు మఱికొందరు కొన్నియభిప్రాయములుగను పలుకుచుఁ దమతమ గృహంబులకుఁ గార్యముఁగానక జనిరి.

నాటిరేయి శ్రీమహావిష్ణువు సింగభూపాలుని స్వప్నమునసాక్షాత్కరించి యేతద్భాగవతము నాకవికిమ్ము లేకున్న నీవంశము నిర్మూలముగాఁజేసెదనని నుడివి యదృశ్యుండై నంత మఱునాడు నృపతి స్వప్న విధమంతయుఁదలపోసి భయకంపితగాత్రుఁడై భాగవతము భూమినుండి పైకిదీయించి పోతనగృహమునకుఁబంపెనట. అందువలన నాభాగవతము శిథిలమైనదని కొందఱునుడువుదురు. మఱికొందఱీక్రింది విధమున నుడువుదురు. ఈకవి శ్రీమదాంధ్రభాగవతముసు సంపూర్ణముగా రచియించి యయ్యది యైహికసుఖేచ్ఛాపరులగు పామరులకునధ్యేయంబైన వేదాంతార్థంబుల గౌరవంబు సెడునని యెంచి ప్రచురింపక పరనార్థులగు ముముక్షుజనుల వెదకుచునుండె ఇట్లుండగాఁ బోతనకు నిర్యాణకాలమాసన్నమగుటయుఁ దనకుమారుఁడగు మల్లనరావించి యతనికి నఖిల రహస్యార్థప్రతిపాదకంబగుచు వెలయు తా రచించిన భాగవతమునిచ్చి దానిని సాధన చతుష్టయ సంపన్నులగు ముముక్షువుల కధ్యేయంబగునట్లు సేయుమనియు దెల్పి పరమపదవిజెందె.

అంతమల్లన పితృవాక్య పరిపాలనాదక్షుండై తద్భాగవతాధ్యేయనాపరుల నెఱుకుచు దానిని బేటికాంతర్గతంబొనరించి దేవ నర్చనా వితర్దిసమీపంబుననుంచి సముచిత భక్తి శ్రద్ధలఁ బూజించుచుండెను.

అవంతర మామల్లనకును గాలావసన్నమగుటచేఁ దనసఖుండును, సహాధ్యాయినగు వెలిగందల నారయకవిని బిలిచి రహస్యంబునఁ దనపితృవాక్యంబుదెల్పి యాభాగవతంబుఁగొనుమని దేవతార్చ

నామందస పూర్వకంబుగానిచ్చి లోకాంతరగతుండయ్యె. పిమ్మట నారయ తనగురుధనంబుజూడ కుతూహలంబున నాపేటిక దెఱచి యందుశిథిలంబు నొందియున్న భాగవతంబునుగని యదిస్వగురుప్రణీతంబుగాఁ దెలిసి శిథిలతనొందుటకెంతయు ఖేదంబునఁగుంది దానినిగట్టి మరలనొకతావున బెట్టియుంచి నాటిరేయి తత్భాగవతంబు జీర్ణంబగుటకు జింతించుచు నిద్రింప బోతనామాత్యు డాతనికి స్వప్నంబున గాన్పించి యిట్లనియె. 'ఓయి! దీనినే నిదివఱకులోకంబున వ్యాపకంబౌనట్లొనరింపకుంటచే నీగతి వగవవలసివచ్చె. ఇప్పుడుజీర్ణంబులైన ఘటంబుల్సంపూర్ణంబుగా జేసి జగద్వ్యాపక మౌనట్లొనరింపుమని తిరోహితుఁడయిన నారయమేలుకాంచి కలతెఱంగెఱింగి పోతనామాత్యు శిష్యులకుదెలిపి వారును నాతనింగూడి దానినంతయు సంపూర్ణంబు జేసిరనియు కలదు.

---

# ఆంధ్ర భాగవత కవులు

---

బమ్మెర పోతరాజు ఆఱుస్కంధములును తచ్ఛిష్యులు ఆరు స్కంధములును రచించినట్లు కాన్పడునని చరిత్రకారుల యభిప్రాయము. అందుపంచమస్కంధంబు గంగనార్యప్రణీతము సప్తమస్కంధము శింగనార్య యేకాదశ ద్వాదశస్కంధములు వెలిగందల నారయణకవి ప్రణీతములయియున్నవని విమర్శకుల యభిప్రాయము యిందుమొదటికివిగాక తక్కినయిరువురును పోతనామాత్యునియెడల గురుభక్తిగలవారుగా వారిపద్యముల వలనను గద్యలవలనను స్పష్టమగుచున్నది.

ఎట్లయినను వెలిగందలనారాయణ తన స్వప్నమునందు పోత నామాత్యునిపల్కులకు మనంబునచింతించి యేతద్భాగవత సంపూర్ణం బునకు గంగనార్యుని శింగానార్యునివలనను సంపూర్ణంబుచేయించి జగద్విఖ్యాతి నొనరించెననియు జెప్పుదురు. శాపు శింగభూపాలునివలన జీర్ణంబయిన్ను భాగవతంబుగని పోతనామాత్యుండు పరమపదవి జెందు నపుడు తనకుమారునకు నాభాగవతంబునిచ్చి భద్రమొనర్చి జగద్వి ఖ్యాత మొనర్చుమనియుకూడ జెప్పుదురు.

పైనజెప్పిన రెండుసంగతులలో నెయ్యదిస్థిరమైనను వాదోప వాదములతో నిముత్తము లేనిది. ఏలయనిన? భాగవతముజీర్ణమయిన సంగతినిజము. జీర్ణమైనభాగవతము నితరులు సంపూర్తిచేసిరనుట జగ మంతయు నెరిగినవాంసమే!

# గంగనార్యుడు

గంగనార్యుడును శిథిలమైనభాగవతమును రచియించిన కవి వర్యుడు ఈతడు తనవంశావళినెంతయును దెల్పికొనకుంటచే నెట్టిసంద ర్భము కలిగియుంటచే భాగవతమునగల ఏశిథిలఘట్టములవ్రాసెనో తెలియదు. ఇతడు పోతనామాత్యుని విధముననే తనగ్రంధంబు గృ ష్ణున కంకితమిచ్చినట్లు కానబడుచున్నయది.

# ఏర్చూరిసింగనమంత్రి

ఈతఁడు భారతశేషమును హరివంశమును దెనిగించిన ఎఱ్ఱా ప్రెగ్గడయొక్కయో కాక కొక్కోక మాంధ్రీకరించిన ఎఱ్ఱాప్రగ్గడ

యొక్క యీ వంశపువాడని చరిత్రలరచియించినవారు వ్రాసియున్నా రు. ఈతఁడు నియోగిబ్రాహ్మణుడు సింగన భాగవతంబు రచించుట కు తగినకారణ మీాక్రిందివిధమున జెప్పియున్నాడు.

ఉ. ఎయ్యదికర్మబంధముల నెల్లహరించు విభూతికారణం
బెయ్యది ? సన్మునీంద్రులకునెల్లకవిత్వసమాశ్రయంబు ము
న్నెయ్యది ? సర్వమంత్రములనేలిన దెయ్యది ? మోక్షలక్ష్మిరూ
పెయ్యది ? దానిబల్కెద సుహృద్యముభాగవతార్థమంత్రమున్.

శ్రీమదాంధ్రభాగవతపురాణంబునందు షష్ఠస్కంధంబు విరచింపం బూని యంకితము శ్రీకృష్ణునకేయిచ్చి

అని శ్రీమహాభాగవతపురాణంబునందు షష్ఠస్కంధం బాంధ్రభాష రచింపంబూని యీకృతిపతిగా నెద్దేవుండు కలడని వితర్కించి నాకుం గవిత్వమహత్వంబు సంప్రాప్తంబగు కాలంబు దలంచి నారాయణుండెదైవంబని యెఱింగి మనోరథంబు సఫలంబయ్యెనని యీకృతి కృష్ణార్పణంబుచేసితి నది యెట్లనిన నేను విద్యాభ్యాసంబునం దగిలి కొండొకనైయుండ నొక్కనాడు దివంబున

చ. కలితవిశేషవస్త్రములుగట్టి హిమాంబుసుగంధచందనం
బలది వినూత్నభూషణములారఁగదాల్చివినోదలీల నిం
పులమృదుశయ్యనిద్రఁదగఁబొందినచోఁ గనుపట్టెఁబల్లఱుం
దలమునఁ గ్రమ్ముకొ్రమ్మెఱుఁగు దండముహూపుననిల్చుపోలికన్

సీ. ఉరువడిఁబ్రాగ్వీధి నుదయించుమార్తాండ
కోటిబింబచ్ఛాయఁగూడినట్లు
హరిహరబ్రహ్మల యాత్మలలోనుబ్బి
కరుణయొక్కటమూర్తి బెరసినట్లు

ఖరకరకరతీవ్రగతిని గిరంగుచు
హేమాద్రిచెంతఁబె ల్లెగసినట్లు
ఫణిరాజఫణరాజి మణిగణవిస్ఫూర్తి
సుషిరంపువెలిదలచూపినట్టు

తే, గీ. లుట్టిపడ్డట్లు కల్పెఱనూదినట్లు
తేజమెసగంగ నామోత్రలదివ్యవాణి
పూనసాక్షాత్కరించి సంపూర్ణదృష్టిఁ
జూచియిట్లనిపలికె మంజులముగాను

ఉ. ఆటలుబాటలుంజదువు లద్భుతముల్ వినసొప్పువాద్యముల్
సాటిదలంపరాని బలుసాములుమున్నగువిద్యలెల్ల నీ
కాటలుబాటలయ్యె వినుమన్నిటికిన్ మెఱుగిడ్డభంగి నా
చాటునఁ జాటుకారపదసాధుకవిత్వము జెప్పుమింపుగాన్

అని యానతిచ్చు జగన్మాతకృపావలోకనసుశ్లోకుండనై యే నొకశ్లో
కంబు నాక్షణంబనుడివితి నది యెట్టిదనిన.

శ్లో. హంసాయ సత్త్వనిలయాయ సదాశ్రయాయ
నారాయణాయ నిఖిలాత్మనివాశ్రయాయ
సత్సంగ్రహాయ సగుణాయ సదేశ్వరాయ
సంపూర్ణపుణ్యపతయే హరయే నమస్తే

ఈశ్లోకంబు ద్దేవియుంగీకరించె నంతమేలుకాంచి యానందభరితుండనై
నాఁటనుండి చంద్రానుగతయగు చంద్రికయుంబోలె నారాయణాంకి
తంబై కవిత్వతత్త్వజ్ఞానంబు గోచరంబయ్యె దానికిఫలంబుగా గోపికా
వల్లభు నుల్లంబుననిడుకొని

ఆ. వె. పలుకఁగలగె మొదలభాగవతార్థంబు
భర్తృకృష్ణుఁడయ్యె భాగ్యమొదవె
నమృతరసముఁ గోర నలరుచింతామణి
పాత్రసంభవించు భంగినిపుడు.

ఆ. వె. భాగవతము దేటపఱుప నెవ్వఁడుసాలు
శుకుడుదక్క నరునిసఖుడుదక్క
బుద్ధిఁదోచినంత బుధులచేవిన్నంత
భక్తినిగిడినంత పలుకువాఁడ.

సింగన ప్రాచీనాంధ్రకవులలో నన్నయను తిక్కనసోమయాజు లును, ఎఱ్ఱాప్రగ్గడను భాస్కరకవివరుని నాచనసోముని, శ్రీనాధుని స్తుతించి, పోతనామాత్యుని క్రిందివిధంబున నుతియించె.

ఉ॥ ఎమ్మెలుసెప్పనేల? జగమెన్నగ పన్నగరాజశాయికిన్
సొమ్ముగవాక్యసంపదలు సూఱలుసేసిన వానిభక్తితో
నమ్మినవాని భాగవతనైష్ఠికుఁడై తగువానిఁబేర్మితో
బమ్మెరపోతరాజుఁ గవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్.

---

# వెలిగందల నారాయణ కవి

ఈకవివర్యుని గుఱించివిస్తరించి వ్రాయుటకు నాధారము లేవి యుగానరావు. మొదటనుదహరించిన హంశమునుబట్టి యీతడు పోత నామాత్యుని శిష్యుని శిష్యుడని దోచుచున్నది.

కొండవీటిసీమలోను, వసియించు వెక్కంద్రు నియోగిబ్రాహ్మ ణులు ఆంధ్రదేశప్రభువులీ దేశమును జయించినపుడు వేఁగి దేశమునకు

వారిలో గోదావరీతీరమునకువచ్చి యిట స్థిరపడిరి.

ఏర్చూరి సింగనమంత్రియింటిపేరు ఎఱ్ఱాప్రగ్గడయని కొందరను చుండిరి. ఎఱ్ఱాప్రగ్గడకవివర్యుని నామమే రానురాను గృహనామమురీతి బరిగణింపబడెననియు ఎట్లనిన? పోతనామాత్యునిదరువాత బోతరాజు వారని గృహనామమెట్లు కలిగినదో యట్లే యని యూహించెనని కొందరు దెల్పుదురు.

నియోగి బ్రాహ్మణులకుఁ బౌరుష నామములు, పురనామములు మొదలగునవి గృహనామములై వర్తించుచున్నయవి. అవిధంబుననే వెలిగందల నారాయణకవివరునియింటిపేరు, గ్రామముకాక పౌరుష నామమేయగునెడల, కందన, అను పద్మపురాణోత్తరఖండ కృతిపతి యొక్క వంశపువాడని స్థిరపరుపవలసియున్నది.

---

# భాగవతకవుల శైలి

---

పోతనామాత్యకృత సప్తమస్కంధంబున హిరణ్యకశిపుని కుమారుండగు ప్రహ్లాదుండు తండ్రితో హరినిదక్క నితరుల ధ్యానింపలేనని జెప్పుటలో నీక్రిందివిధముగ బద్యమురచించె.

సీ॥ మందారమకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీ వీచికల దూగు
రాయంచ సనునె తరంగిణులకు
లలితరసాలప ల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
గీ॥ అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త

చిత్త మేరీతి నితరుల జేరనేర్చు
వినుతగుణశీల మాటలు వేయునేల?

భాగవతమునం దితరులు రచించిన భాగములయందు రుక్మిణిని శ్రీకృష్ణుండు దోడ్కొనిపోయి పరిణయమాడి గృహంబున భార్యతో విరసోక్తులాడిన రుక్మిణీసతి భర్తయైన భువనభర్తను వీక్షించి నిన్ను దక్క నన్యుల నెట్లుచేరగలుగుదునని చెప్పినటుల నీక్రిందివిధమున బద్యము చూపట్టుచున్నది.

సీ. నీరదాగమమేఘ నిర్యత్పయఃపాన
చాతకంబేగునే చౌడిపడెకు
పరిపక్వమాకంద ఫలరసంబులగ్రోలు
కీరముల్ జనునె దుత్తూరములకు
ఘనరవాకర్ణనోత్కలికమయూరము
ల్గోరునే కఠినఝల్లీరవంబు
కరికుంభపిశితసద్గ్రాసమోదితసింహ
మరుగునే శునకమాంసాభిలాష

గీ. ప్రతిమలాకారభవదీయ పాదపద్మ
యుగసమాశ్రయనైపుణోద్యోగచిత్త
మన్యుఁగోరునె? తనకుపాస్యంబుగాగ
భక్తమందారదుర్భవ భయవిదూర

పైవిధముగా పోతనరచనమునకు నందితరులు రచించినదానికిని బెక్కుతావుల సమానంబుగానున్నవి.



# కవిత్వ ప్రశంస

పోతరాజుకవిత్వ మతిమృదులపదఘటితంబుగావున శ్రవణ రసాయనంబై శబ్దాలంకార భాసమానంబుగావునఁ బండితపామరజన మనోరంజనంబై సకలజనులచిత్తాబ్జముల కమందానందం బొసగకమానదు. అర్థమాపాతస్ఫూర్తి గలిగియుండు గావునఁ గేవలము ద్రాక్షా పాకంబై యొప్పును. సమతాప్రసాదమాధుర్యాది కావ్యగుణంబు లెల్లద గన్పట్టు నారసానుగుణంబుగ శైలియు సముచితవృత్తిరతులును గూర్చి రసపోషణము గావించుటయందే పోతనామాత్యు డత్యంత సమర్థుఁడు ఇందనేకవిధములగు వర్ణనములచే నొప్పించితత్త్వార్థవివృతిచే నెంతయు భాసిల్లఁజేసి నిరుపమానమగు కవిత్వధారయెల్లడ నమృత ప్రవర్తియుంబోలె మానసోల్లాసదాయకంబగునట్లు శ్రోతలశ్రవణములకు విందొనర్చు. అందర్థసారస్యమంతగా బాటింపకున్నను పద వాక్యగ్రథనంబునం దనురూపపాటవంబుగలిగి రసానురూపరచనా నియమంబున విలసిల్లునట్లు పోతన కృతిసేయదగు సమర్థుండని గ్రంథ భాగంబులందు నేర్పరులకుఁ దెల్లంబుగ దెలియవచ్చు. ఈతఁడేరసము వర్ణించిన భక్తి దీపనంబున కించుకైనగొఱవడకయుండు రసపుష్టియుందును శబ్దాలంకారమైచిత్రమునందును నీకవివర్యునకు విశేషదృష్టియుండుటంజేసి యితనికవిత్వమునం దచ్చటచ్చటఁ శబ్దాడంబరము వ్యర్థపూరణంబు ప్రయోగింపబడినను, అయ్యవి వీనులకెంతయు విందైయుండునన నిస్సందేహము.

ఈతఁడురచించిన భాగవతముజదువ నెట్టవారికినైన మేను పులకరింపకమానదు. ఈపోతనామాత్యుండు వేంకటగిరిపరిపాలకుడు రావుసింగభూపాలునకంకితమీయ భోగినీదండకమునురచియించి ఈరా

జనకునకు వినుపింప నాతఁడాలించి తానొకవారకాంతకు లోఁగినకళంకంబున న
త్యంతలజ్జాభరితాంతఃకరుణుండైనం బోతనమునంబున దెలిసికొని

ఆ॥ వె. రసికులైనవారు రమణులకొకవేళ
పంగుటెల్లధర్మవర్తనంబు
ఈరసమునవిల్లు నారికివంగదా
చిత్తజాతరూప సింగభూప!

అనిపద్యము వెంటనే తనచమత్కృతిజూపినట్లే భాగవతంబునం
దందందు బొంకంబుగా శృంగారరసంబును బోషించుటయుం దెంతయు
సమర్థుఁడు మిగిలినరసంబుల సందర్భానుసారముగా జేర్చుటకును మిక్కి
లినేర్పరి. ఈతఁడేరసమెట్లు వర్ణించినను చదువరలకెంతయు నింపొసగు
చుండునన్నమాట జగమెరింగినదియే.

శబ్దాలంకారంబులందంత్యప్రాసనియమమున వ్రాయుటకవీశ్వరు
లకందఱకు సామాన్యమైయున్నను నీకవివరేణ్యునకుఁబ్రధానాంగమం
బుగఁదన గ్రంథంబునందు బెక్కుతావుల నుపయోగించియున్నవాఁడు
అంత్యప్రాసనియమంబుల కుదహరణంబు గొన్నిటివ్రాసెద,

ఉ॥ ఆతతసేవజేసెద సమస్తచరాచరభూతసృష్టి వి
జ్ఞాతకు భారతీహృదయ సౌఖ్యవిధాతకు వేదరాశి ని
ర్ణేతకు దేవతానికర నేతకుఁ గల్మషజేతకుఁ నత
త్రాతకు ధాతకుఁ నిఖిల తాపసలోకశుభప్రదాతకున్,

స్కం. 1. ప. 3.

ఉ॥ ధాతవు భారతశ్రుతివిధాతవు వేదపదార్థజాల వి
జ్ఞాతవు కామముఖ్యరిపుషట్కవిజేతవు బ్రహ్మతత్త్వని
ర్ణేతవు యోగినేతవు వినీతుఁడ నీవు చలించి చెల్లరే
కాతరు కైవడిన్ వగవ గారణమేమి! పరాశరాత్మజా॥

స్కం 1 ప 89

పైపద్యమునే యేర్చూరి సింగన షష్ఠస్కంధంబునందు వక్ష్యమాణంబుగ వ్రాసియున్నాడు.

ఉ॥ ధాతకు దేవతావిభవధాతకుఁ బుణ్యజనానురాగ సం
ధాతకు సర్వలోక హితధాతకు వైదికధర్మమార్గ ని
ర్ణేతకు నుల్లసద్విభవ నేతకు సర్వజగజ్జయాంగజ
భ్రాతకుఁ బుణ్యయోగిజన భావవిజేతకు మ్రొక్కి రయ్యెడన్.

క॥ రామున్ మేచక జలద
శ్యాముని సుగుణాభిరాము సద్వైభవ సు
త్రామునిఁ దుష్టనిశాట వి
రాముంబొమ్మనియెఁ బంక్తిరథుడ డవులకున్.

ఈపద్యము భాస్కర రామాయణములో బాలకాండమందలి 339 వ పద్యముతో బోల్చిన సరిపోలియున్నది.

---

# నామవాచకములయందు జిత్రము

క౦. చిత్రింబులు త్రైలోక్య ప
విత్రంబులు భవలతాలవిత్రంబులు స
న్మిత్రంబులు మునిజనవన
చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్.

స్కం 7 వ 6

కం పరిభూత వ్యధనంబులు
నిరుపమ సంసారజలధిసర్మ ధనంబుల్

నరకేశరి కథనంబులు
పరిరక్షితదేవయక్ష ఫణిమిథనంబుల్.

స్కం 7 ప 28

శా॥ సూనున్ శాంతగుణప్రధాను నతి సంశుద్ధాంచితజ్ఞాను న
జ్ఞానారణ్య కృశానునంజలిపుటీ సంభ్రాజమానున్ సదా
శ్రీ నారాయణపాదపద్మయుగళీ చింతామృతాస్వాదనా
ధీనుణ్ ధిక్కరణంబుసేసిపలికెన్ దేవాహితుం డుగ్రతన్.

స్కం 7 ప 256

పాదపాదంబునకు వేర్వేఱుగా సంత్యాను ప్రాసంబులున్నికి నుదాహరణము.

సీ॥ కమనీయశుభగాత్రుఁ గంజాతదళనేత్రు
వసుధాకళత్రుఁ బావనచరిత్రు.
సత్యసంకల్పు ని శాచరోగ్రవికల్పు
నతపన్నగాకల్పు నాగతల్పు
కౌస్తుభమణిభాను గంభీరమృదుభాషు
శ్రితజనపోషుసం చితవిశేషు
నీలనీరదకాయు నిర్జితదైతేయు
ధృతపీతకౌశేయు నతవిధేయు

తే. గీ. నఘమహాగదవైద్యు వేదాంతవేద్యు
దివ్యమునిసన్నుతామోదు దీర్ఘపాదు
జిష్ణువరసద్గుణాలంక రిష్ణుఁగృష్ణు
జూడుదైతేయకులబాల సుభగశీల

కం. భూషణములు వాణికినఘ
పేషణములు మృత్యుచిత్తభీషణములుహృ

త్తోమణములుఁ గల్యాణవి
శేషణములు హరిగుణోపచితభాషణముల్.

ఇట్టివి పెక్కులుగలవు. ఈతడు రచించిన గ్రంథమునం దెచ్చట జూచిన నీతనిపాండిత్యము పూర్వకవీంద్రుల పదగుంభనాలంకారములకు సమానముగను, కొంచెమధికముగనుగనఁబడును. తిక్కనకవీంద్రుఁడు సంగ్రహాశయ్యకును బోతనామాత్యుడు పదయమకంబునకును బ్రసిద్ధులు. తిక్కనభారతమునం దుద్యోగపర్వమునందు శ్రీకృష్ణుడు రాయబారియై కరిపురమునకరిగిన నప్పురిగలస్త్రీజనంబులు శ్రీకృష్ణుని గని తమతమమనంబులలో నాతనిచర్యల వితర్కింపు యనుకొనిరని ఈపద్యములో వ్రాసియుండెను.

సీ. పాణంబుతోఁగూడ రక్కసిచన్నుల
పాలుద్రావినప్రౌఢ బాలుడితడె
వ్రేల్మిడిజానూరువిఱిచి లోకముల మె
చ్చించిన యాజగజెట్టియితడె
దుర్వృత్తుఁడగు కంసుదునిమి యాతనితండ్రి
బట్టంబుగట్టిన ప్రభువితండ
సత్యభామకు పారిజాతంబుపైఁగల
కోర్కెదీర్చిన రసికుండితండె.

గీ. వెన్నలునుగోపికావృత్త వృత్తములును
నరసిముచ్చిలనేర్చిన హరియితండె
శ్రుతిశిరోభాగములు దనసుభగచరణ
సరసిజామోదమునుగూర్చు చతురుడితడె?

పోతనభాగవతములో దశమస్కంధమున నీక్రిందివిధముగ వ్రాసె.

సీ. వీడచేరక్కసి విగతజీవిగఁజన్ను
బాలుఁద్రావినమేటి బాలకుండు

వీడటే నందుని వెలదికి జగమెల్ల
ముఖమందుజూపిన ముద్దులాడు
వీడటే మందలో వెన్నలుదొంగిలి
దర్పించిమెక్కిన దావరేడు
వీడటే యలయించి వ్రేతలమానంబు
జూరలాడిన లోకసుందరుండు

తే. గీ. వీడు లేకున్నపుర మటవీస్థలంబు
వీనిఁబొందనిజన్మంబు విగతఫలము
వీనిఁబల్కనివచనంబు విహగరుతము
వీనిఁజూడనిజూడ్కులు వృథలువృథలు.

అని రచియించె.

# భాషాంతరీకరణము

పోతన సంస్కృతమునుండి భాగవతము నాంధ్రీకరించుచో నాయాసందర్భముల కనుగుణంబుగ వినువారికెంతయు నానందము నొదవించునట్టుల గొన్నిచోట్ల మూలముననుసరించియు గొన్నియెడల శ్రీధరవ్యాఖ్య ననుసరించియుఁ గొన్నితావులమూలమునకంటె నధికముగను వృద్ధిమొనర్చియు వర్ణనము లెక్కువచేసియు గొన్నిచోట్ల మూలవ్యాఖ్యల రెంటిననుసరించియుఁ గొన్నిపట్టులనాయాసందర్భములింపుగానుండకున్న వదలియు నిట్లు పలువిధంబుల రచనానైపుణ్యము జూపియున్నాడు. మూలముననుసరించి పోతనవ్రాసియుండెననుటకు నిదర్శనముల గొన్నిటిని మాత్రమే పేర్కొని వ్రాసియుంటిని.

శ్లో. యతోనకశ్చిత్క్వ చకుత్రవిద్యా
దేనస్వమాత్మా నమలంసమర్థః
విమోచితుంకామదృశాంవిహార
క్రీడామృగోయన్నిగళోవిసర్గః. స్కం. 7. అ. 6 శ్లో. 25

శా. హాలాపాన విజృంభమాణ మదగర్వాతీతదేహాల స
ద్బాలాలోకన శృంఖలానిచయసంబద్ధాత్ముడై లేచమర్త్య
వేలానిస్సరణంబుగానక మహావిద్వాంసుడుం గామినీ
హేలాకృష్టకురంగశాబకమగున్ హీనస్థితిం జెందెడిన్.

స్కం. 7. ప 215

శ్లో. హిరణ్యకశిపుః_ప్రహ్లాదఉచ్యతాంతాతస్వధీతంకించిదుత్తమమ్
కాలేనైతావతాయుష్మన్ యదశిక్షద్గురోర్భవాన్

స్కం. 7. అ 5 శ్లో 23

శ్లో. ప్రహ్లాదః-శ్రవణంకీర్తనంవిష్ణోః స్మరణంపాదసేవనమ్
అర్చనంవందనందాస్యం సఖ్యమాత్మనివేదనమ్.

స్కం. 7. అ. 5. శ్లో 24

శా. చోద్యంబయ్యెడినింతకాలమరిగెన్ శోధించి యేమేమిసం
వేద్యాంశంబులు సెప్పిరో గురువులే వెంటంబఠింపించిరో
విద్యాసారమెరుంగగోరెద భవద్విజ్ఞాతశాస్త్రంబులో
బద్యంబొక్కటిసెప్పిసార్థముగఁ దాత్పర్యంబుభాషింపుమా,

స్కం. 7. ప. 163

శా. నిన్నున్ మెచ్చరుసీతిపారమహిమన్ నీతోడిదైత్యార్భకుల్
గన్నారన్నియుఁజెప్ప నేర్తురుగదా గ్రంథార్థముల్ దక్షులై

యన్నా యెన్నఁడుఁ నీవు నీతివిదుఁడౌ వంచున్ మహా వాంఛతో
నున్నాఁ డక్కసుఁ గన్నతండ్రి భవదీయోత్కర్షముం జూపవే.
స్కం. 7. ప. 164

క. చదివించిరి ననుగురువులు
చదివితిధర్మార్థ ముఖ్యశాస్త్రంబులు నేఁ
జదివినవిగలవు పెక్కులు
చదువులలోమర్మమెల్ల జదివితిఁదండ్రీ. స్కం. 7. ప. 166

మ. తనుహృద్భాషలసఖ్యమున్ శ్రవణముల్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలోనెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బనునీతొమ్మిదిభక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుటభద్రమంచుఁ దలతున్ సత్యంబు దైత్యోత్తమా.
స్కం. 7. ప. 167

శా. అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూక స
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసకవధూకాంక్షల్ కృతఘ్నావలీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తివర్జితులరిక్త వ్యర్థసంసారముల్
స్కం 7. ప. 268

సీ. కమలాక్షునర్చించు కరములుకరములు
శ్రీనాథువర్ణించు జిహ్వజిహ్వ
సురరక్షకునిజూచు చూడ్కులుచూడ్కులు
శేషశాయికి మ్రొక్కుశిరముశిరము
విష్ణునాకర్ణించు వీనులువీనులు
మధువైరిదవిలిన మనముమనము

భగవంతువలఁగాను పదములుపదములు
పురుషోత్తమునిమీఁది బుద్ధిబుద్ధి

తే. గీ. దేవదేవునిఁజింతించు దినముదినము
చక్రహస్తునిఁబ్రకటించు చదువుచదువు
కుంభినీధవుఁజెప్పెడి గురుఁడుగురుఁడు
తండ్రిహరిఁజేరుమనియెడి తండ్రితండ్రి. స్కం. 7. ప.169

సీ. కంజాక్షునకుఁగాని కాయంబుకాయమే
పవనగుంభితచర్మ భస్త్రిగాక
వైకుంఠుఁబొగడని వక్త్రంబువక్త్రమే
ఢమఢమధ్వనితోడి ఢక్కగాక
హరిపూజనములేని హస్తంబుహస్తమే
తరుశాఖనిర్మితదర్విగాక
కమలేశుఁజూడని కన్నులుకన్నులే
తనుకుడ్యజాలరంధ్రములుగాక

ఆ. వె. చక్రిచింతలేని జన్మంబుజన్మమే
తరళసలిలబుద్బుదంబుగాక
విష్ణుభక్తిలేని విబుధుండువిబుధుఁడే
పాదయుగముతోడి పశువుగాక. స్కం. 7. ప. 170

సీ. సంసారజీమూత సంఘంబువిచ్చునే
చక్రిదాస్యప్రభంజనములేక
తాపత్రయాభీల దావాగ్నులాఱునే
విష్ణుసేవామృత వృష్టిలేక

సర్వంకషాఘౌఘ జలరాసులింకునే
హరిమనీషాబడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారంబులడగునే
పద్మాక్షునుతిరవి ప్రభలు లేక.

తే. గీ. నిరుపమాపునరావృత్తి నిష్కళంక
ముక్తినిధిగానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండ చింతనాంజనము లేక
తామరసగర్భునకునైన దానవేంద్ర! స్కం. 7. ప 171

పైనవ్రాసిన మూడుశ్లోకంబులకు మూలంబుకన్న నెక్కువగా విస్తరింపబడి యెంతబాగుగామన్నవో చూడుడు. శ్రీధరాచార్య వ్యాఖ్యానము ననుసరించియు నంతకన్న నెక్కుడుగా నొప్పుభావములను రచించినన నుదాహరణము.

---

# దశమస్కంధము

---

## కాళీయపత్నిస్తవము.

---

నమోఽనంతాయ సూక్ష్మాయవిపశ్చితే
నానావాదానురోధాయ వాచ్యవాచకశక్తయే.
నమఃప్రమాణమూలాయ కవయేశాస్త్రయోనయే.

---

# శ్రీధరాచార్యవ్యాఖ్యానము

"నమయితి" అనంతాయ, అహంకారాపరిచ్ఛేదాత్, అతః, సూక్ష్మాయ, అదృశ్యత్వాత్, అతఏవ, విపశ్చితే సర్వజ్ఞాయ; "నానేతి" నానావాదానురోధాయ-అస్తి. నాస్తి, సర్వజ్ఞః, కించిజ్జః, బద్ధ, ముక్తః, ఏకః, అనేకః, ఇత్యాదీన్, నానావాదాన్, అనురుణద్ధి, మాయయానువర్తతే,యస్తస్మై; వాచ్యవాచకశక్తయే-అభిధానాభిధేయ శక్తిభేదాదపి। నానాత్వేప్రతీయమానాయ—'నమఇతి' ప్రమాణమూలాయ చక్షురాదీనాం చక్షురాదిరూపాయ, అతఏవకవయే—స్వయంతన్నిరపేక్షజ్ఞానాయ; కుతఃశాస్త్రయోనయే—వేదాత్మకనిష్ఠాయ.

# ఆంధ్రీకరణము

సీ. విశ్వంబునీవయై విశ్వంబుఁజూచుచు
విశ్వంబుసేయుచు విశ్వమునకు
హేతువైపంచభూత మాత్రేంద్రియ
ములకు మనఃప్రాణబుద్ధిచిత్త
ములకెల్ల నాత్మవై మొనసిగుణంబుల
నావృతమగుచు నిజాంశభూత
మగునాత్మచయమున కనుభూతిసేయుచు
'మూఁడహంకృతులచే మునుగునడక'

తే. గీ. నెఱిసనంతుఁడ వై 'దర్శనీయరుచివి
గాక' సూక్ష్ముఁడవై 'నిర్వికారమహిమ'
దనరి గూటస్థుడన 'సమస్తంబు నెఱుగు'
నీకు మ్రొక్కెద మాలింపు నిర్మలాత్మ !

మఱియుఁ గలండు లేఁడు సర్వంబు నెఱుంగు నించుక యెఱుంగు బద్ధుండు విముక్తుండొకండ నేరుండు వనఁ వి మొదలుగాఁ గల వాదంబులు మాయవలన ననురోధింపుదువు గావున' నానా వాదానురోధకుఁడవయ్యు నభిదానాభిధేయశక్తి భేదంబువలన బహుభావప్రతీతుండవయ్యును, 'జక్షురాదిరూపంబులవలన' ప్రమాణమూలకుండవయ్యు. 'నిరపేక్షజ్ఞానంబు కలిమిఁ గలివయ్యు వేదమయ నిశ్వాసత్వంబువలన శాస్త్రయోనివయ్యు.

పైనఁ కుండలీకరణములుగలవియె కవి కేవలము వ్యాఖ్యానము నుండిమాత్రము గైకొని తెనిగించినవగుటచే నతండా వ్యాఖ్యానమునే యనుసరించి రచించినాడనుట బాగుగాఁ దెలియునగును. మఱియు గేవలకావ్యసరణికి సరసముగాఁ దోపనితత్త్వవిషయములను గూడ నతి పేశలకవనంబున హావణించి మనోహరముగాఁ దోపించుటయందీకవి మిక్కిలి నిపుణుడు. అచ్చతెనుగుపదములచేఁ బెక్కుపద్యములీపోతనచే మిక్కిలి సొంపుగాఁ గూర్పఁబడినది.

---

# అచ్చ తెనుఁగు పద్యములు

---

కం. క్రొక్కారు మెఱుఁగుమేనులు
గ్రిక్కిఱిసిన చన్నుఁగవలు గ్రిస్సిననడుముల్

పిక్కటిలి యున్నతుఱుములు
జక్కని చూపులను దివిజసతులకు నొప్పెన్. స్కం. 8. ప. 263

కం. తొలుకారు మెఱుఁగు కైవడి
తళతళమని మేను మెఱయ ధగధగమనుచుం
గలుములనీనెడు చూపులఁ
జెలువంబుల మొదటి టెంకి సిరి పుట్టె నృపా. స్కం. 8. ప. 865

సీ॥ పాలమున్నీటిలోఁ బలిమీఁది మీఁగడ
మిసిమి జిడ్డునఁ జేసి మేను వడసి
క్రొక్కారు మెఱుఁగుల కొనలక్రొత్తళుకుల
మేని చేఁగలనిగ్గు మెఱుఁగు సేసి
నాఁటి నాటికిఁ బ్రోదినవకంపుఁదీవల
నునుబోదనెయ్యంబు నూలుకొలిపి
క్రొవ్వారు కెందమ్మి కొలకునఁ బొద్దునఁ
బొలసిన వలపులఁ బోఁదివెట్టి

తే॥ గీ. పసిఁడి చంపకదామంబు బాగుఁగూర్చి
వాలుక్రొన్నెల చెలువున వాఁడిదీర్చి
జాణతనమునఁ జేతులజడ్డువిడచి
నలువ యీకొమ్మ నొగిఁ జేసినాడు నేఁడు.

స్కం. 8. ప. 266

కొన్నిచోట్ల మానసంబున కెంతయు నుల్లాసంబొదవు విధంబున సుకుమారశైలిం గూర్పఁబడి యీపోతనకవిత్వం బతిరమ్యంబై యున్న యది. ఈతని భాషాంతరీకరణ మెంతయు మనోజ్ఞమై సొంపారుచుండెను.

ఇట్లు పోతన సహజపాండిత్యుండగుటచే లక్షణ విరుద్ధంబులు గొన్ని తమయంతన గ్రంథమునందు, ప్రయుక్తములై యుండవచ్చును లఘ్వరేఫముల మైత్రియు నితఁడు సమ్మతింపఁడని కూచిమంచి తిమ్మకవి, యట్లుమనమందరమును దలంపవచ్చుఁగాని యారసిచూచిననా తఁడు రెండును గలిపియేయుండుననిపండితులయభిప్రాయము కూచిమంచి తిమ్మకవి.

సీ॥ అఖిలవేదాంత విద్యా రహస్యవిదుండు
సహజపాండిత్య విశారదుండు.
మత్తకృతీశాధ మస్తోత్రవిముఖుండు
శంభుపదాబ్జ పూజారతుండు
ఘటుతరకవితావిభాసిత ప్రముఖుండు
సకలాంధ్రలక్షణ చక్రవర్తి
రఘుకులేశ నిదేశరచిత మహాభాగ
వత పురాణుఁడు పుణ్యవర్ధనుండు.
తే॥ గీ. బుధజనహితుండు బమ్మెర పోతసుకవి
యెన్న రేఫఱకారంబు లెఱుగడనుచు
నజ్ఞులొక్క కొందఱాడుదు రామహాత్ము
కవితరెందునులోపంబు కలుగదధిప?
ఆ॥ వె. కాకునూరి యప్పకవి యహోబలపతి
ముద్దురాజు రామముఖ్యులెల్లఁ
బోతరాజు కబ్బమున ఱాలురేఫలుఁ
గదిసెనంచుఁ జెప్పిరదిహుళిక్కి.

అనిస్థిరపఱచిన ప్రకారము పోతనకొన్నితావుల లఘ్వలఘురేఫములు గలుపక ప్రాసానులఁ గూర్చియున్నాఁడు. అయ్యది ప్రాసములం.

దితనికి మిక్కిలియభిరుచిగలుగుటచే నట్లు రెంటినిగలుపక వ్రాసినాడుగాని రెంటినిగలుపఁగూడదను నియతిజేసికాదు. కనుకనే యచ్చటచ్చట రెంటిని గలిపియున్నాడు. పైసంగతి సూచించునటులనే కాకునూరియప్పకవి తనగ్రంథమునందీ క్రిందివిధంబున వ్రాసియుండె.

ఉ॥ బమ్మెర పోతరాజకృత భాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహి నేమిటం గొదువ? యంతయు నారసిచూడగాను రే
ఫమ్ములు ఱాలునుంగలసి ప్రాసములైన కతంబునంగదా
యిమ్ములనాదిలాక్షణికులెల్లరు మాని రుదాహరింపగన్.

అట్లు వ్రాయుటవలన పోతనరచించినగ్రంథమున నీరేఫయుగమైత్రిదోషంబుదక్క తక్కుంగలదోషమ్ములు లేవని సమ్మతించునట్లు తెలియుచున్నది.

ఈరేఫయుగమైత్రిదోషంబొక దోషంబులోనిదిగాదనియు భాగవతంబు దోషరహితగ్రంథంబనియు మఱికొందఱుపండితులు నుడువుదురు. రేఫములయొక్క మైత్రికి సమ్మతించుటచే నప్పకవీంద్రుడు దోషంబుగల్గునని పైవిధంబున బద్యంబును వ్రాయుట తనయొక్క యభిప్రాయము స్థిరపఱచుటకుగాని మఱియొక్కటిగాదు. అప్పకవిరచించిన లక్షణగ్రంథంబునందును రేఫయుగమైత్రిదోషంబు పద్యములందుఁ గాన్పించుచున్నయది.

అప్పకవి రచియించిన లక్షణగ్రంథములో ఱాకార సీసమాలికలో నీక్రిందివిధమున వ్రాసియుండె

సీ॥ తాఱుమేకంబులీ తీరున (తారు—తీఱున)
పడఁతిదేహము గరుపాఱుట పీరుట. (పీరుట)
మాఱుమాటాడుట మాఱుమొగంబు వే
మాఱు పెద్దలమాట మీఱి చనుట

(మూఁడు మొగంబు—వేయూరు)

యిట్టివి పెక్కులెన్నియో గలవు.

ఇఱ్ఱియు వెఱ్ఱియు, వ్రాయునప్పుడెల్లు క్రిందజడ్డలుండుట లిపులెల్ల బండిఱాలనియు—పీనిద్విత్వముల నొకసమయమున బోయిన బోవును. ఎట్లనిన? జిఱ్ఱపోతు, కఱిమేక, యనఁగనని ముంగసూత్రము వ్రాసి పిమ్మట కొఱ్ఱశబ్దంబులుప్తశేషంబయినప్పుడు 'కొఱ' యని వ్రాయక 'కొర' యని లఘురేఫముతో వ్రాసె.

'రాదక్కవకలాక్షరముల మీఁదనుగర
కదియు లకార ళకారములన'

పైవిధంబున రేఫ సీసమాలికలో వ్రాసియున్నాఁడు అందు 'ఱ', శకటరేఫ సంజ్ఞకము. ఇట్టుల లెక్కించిన వెన్నియో కలవు.

ద్విరేఫదర్పణమునందు కొణంగి రంగనాథకవి వ్రాసిన అప్పకవి దోషములు.

---

# ఱేఫస ప్రాస

---

కం. కేరుచు నొయ్యన డగ్గఱి
జేరుచు నురుముష్టిహతికిఁ జిక్కక వేగం
దాఱుచు హుంకృతిఁ గన్నఱ
మీఱుచు ధోకుజుఁడు మల్లు దుంచె ననంగన్

మ॥ పురిటింటం బసిబిడ్డ చెండుమున వాపోవంగ నాడాత్మలో (2)
మఱువాఁ డప్పుడు దుర్గుణుక్తముచయై యుద్దామ రాకాసి గు

రైతేఁ గిష్టమంబుగఁ బాలుద్రావుమిషచే నిర్వైవకాలంబునం
ధరణింగూల్చిన నందపుత్రువలనం దార్క్షాణధర్మస్థితిన్

---

## అలసాని పెద్దనమను చరిత్ర

---

శా॥ శ్రేణుల్గట్టి నభోంతరాళమునఁ బాష్పాంశు పాటంబులు
పాణవాత్రము

---

## శ్రీకృష్ణదేవరాయలు-ఆముక్తమాల్యద

---

మ॥ ఇలకున్వ్రిగుఁగఁబండుతీరవన పుండ్రేక్షుచ్ఛటల్ తీష్ణల
గ్గలమైవ్రాలను రుప్వనంబులెసగం గాద్రిప్పరాట్సంపుగుఁ
డ్రిలునాఁ దేనెకొలంకులంబొరలిపాఱువ్వచ్చు

---

## పింగళిసూరన-ప్రభావతి ప్రద్యుమ్నము

---

కం॥ గ్రిక్కునఁజని వ్రాలుదునో
తెక్కలుఁగట్టుకొని దివిజరిపుమేడల్పై

---

# అయ్యలరాజు రామభద్రుడు
# రామాభ్యుదయము

---

ఉ॥ సైరిభవారిభద్విరద శాసనఖడ్గఖరాధి రూఢులై
తారలు బూరగొమ్ములును దప్పెటలుంబటహంబులుఁబదు
ల్వాఱులు .... .... .... ...

---

# పిలల్లమఱ్ఱి పినవీరభద్రకవి
# జైమినీభారతము

---

ఉ॥ తూరుపుతెల్లవాఱుటయు దోడనెమంగళపాఠకస్తుతుల్
మీఱఁద దేయరాగములు

అప్పకవియట్లు తనయభిప్రాయము వ్రాసినను భాగవతమున కేమియు కొఱఁతలేదు. రకారమైత్రితో వ్రాసినకవులగ్రంథములు లక్షణవిరుద్ధములయ్యెనా! ఆదోషమున భాగవతము లక్షణగ్రంథము కాకుండలేదు. భాగవతము జీర్ణమగుటచే ననేకులందు రచియించుటచే నట్టిప్రమాదములుండవచ్చును. భాగవతమించుమించుగనన్నూటయఱువదియేండ్లకు మున్నుగీర్వాణభాషనుండి యీపోతనామాత్యునిచే నాంధ్రీకరింపబడినది. భాగవతము తాళపత్రములయం దుండుటచే లేఖకు లెందరిచేతనో వ్రాయబడియున్నది. లేఖకులందఱును బండితులైయుందురా!—'ప్రమాదోధీమతామపి' యనున్యాయము చొప్పున భాగవతమునందలి ప్రమాదములు కానవచ్చుచున్నవి.

అయ్యవిదోషంబులైనను మహాకవిప్రయోగములనియు నిర్దుష్టము లనియు నమస్కరించుచున్నారు—విమర్శకులు భాగవతమునందుగల లోపంబుల నీక్రిందివిధమున బల్కుచున్నారు.

---

## అకారప్రయోగము

---

1. చ. హరిబరమాత్మునచ్యుతు ననంతునిఁజిత్తములందలంచిసు
స్థిరతవిశోకసౌఖ్యములఁ జెందినధీనిధులన్యకృత్యము
ల్మఱచియుఁజేయ నొల్లరుతలంచిననట్టిదయౌను శేంద్రుడు
బరువడినుయ్యిద్రవ్వునె? పిపాసితుఁడై సలిలాభిలాషితన్

స్కం. 2. ప. 209

2. చ. వరవరవేణుజానలవి నష్టమహాటవిమాడ్కిఁబాండు భూ
వరధృతరాష్ట్రసూను లనివార్యనిరోధ మెత్తియొం
డొరులజయింపఁగోరికచనోర్విఁ గురుక్షితిపాలముఖ్యులం
దఱుమ్మృతు కాటయున్ విని ఘనంబుగశోకనిమగ్నచిత్తుఁడై

స్కం. ౧. ప. 43

క. మఱునాఁడు రేపకడభా
సురపుణ్యుఁడుఘనుఁడు మధునిషూదనచరణ
స్మరణక్రీడా కలితుఁడు
దరియించెంగలుషగహన దహనన్యమునన్,

స్కం. 3. ప. 170

క. తెఱఁగొప్ప నఖలవిశ్వముఁ
బురుషోత్తముమాయచేతఁ బుట్టుంబెరుగున్

పింతింబోందుచు నుండుం

గరమర్థిన్ భూతభావి కాలము లందున్ స్కం 3. ప. 574

మ. చిరభాగ్యోదయ దేవదేవలలిత శ్రీపద్మల తొమ్మంగయీ
వరవిప్రానుపదైకపుణ్యరజమే వర్ణింపనీమేని కా
భరణంబంటివిసర్వలోకులకు విప్రశ్రేణిసుహాత్మ్య మీ
వెఱుగం జెప్పటకై ధరింతిగదా యెన్నంబవిత్రాకృతిన్.

కం. నెఱినట్టి జలజభవునకుఁ
గరమంతఃకరణగా త్రకముల్లైవరుసం
బరఁగిన బ్రహ్మత్వము
లరయరమాధీశ్వరునకు నవసీయంబుల్.

ఇవియుఁగాక తృతీయస్కంధమునందిట్టి ప్రాసములు గన్పట్టు చున్నవి. ఈభాగవతమునందు వ్యాకరణదుష్టంబులగు ప్రయోగంబులు గొన్నిగానవచ్చుచున్నవి. అందువలన లక్షణగ్రంథముకాదనిరికాని రకారమైత్రి గల్గుటచేఁ గారు

---

# ఉదాహరణములు

1. క్త్వార్థకేత్తునకు సంధిలోనగుదుష్టసంధులు సేయుటయు.

2. హ్రస్వంబు మీఁదీనకారంబున కచ్చుపరంబగునపుడు సంస్కృతంబునంబోలె ద్విత్వంబువచ్చుటయు,

3. ఉకారాంతశబ్దమునకు కువర్ణకము పరంబగుచో నగాగమంబు రామియు, మొదలగాగల కొన్నిదోషంబులు చంద్రబింబమున గళంకమువలె గన్పట్టుచున్నను నయ్యవి యొక లోటుగా నెవ్వరు బరిగణింపరు.

1 క్త్వార్థకేత్తునకు సంధి ఉదహరణములు

ఎఱిఁగెఱిఁగి బ్రహ్మహత్యాదురితంబు గద్యసంఖ్య 931

ఒదిఁగుండి 1237

కోసిచ్చె 724

2 హ్రస్వంబుమీఁది నకారంబునకు అచ్చుపరంబగునప్పుడు ద్విత్వంబు వచ్చుట కుదహరణములు

" నీటిపోరాటన్నోటమిపాటఁజూపుట కరణ్యాటంబువాచాటమై

స్కం. 8 ప 57

" వింటినన్నముఁగొంటి నీగృహమునన్ వేడ్కన్ ఫలంబబ్బె"

స్కం. 9. ప. 146

3 ఉకారాంతశబ్దమునకు కవర్ణకంబుపరంబగుచోఁ నగాగమంబు రాఁమికుదాహరణములు.

1 భాగవతసంగలపభాపలమ్ముకీడె స్కం, 1. ప. 244

2 హాధినమ్మనువుకు శతరూపవలన స్కం. 1. న. 217.

3 ఎఱుకుకు 723

మఱియును గొన్ని కొన్ని తావులయందు ప్రాసభంగములు, గణభంగములు, యతిభంగములు నొదవుచున్నవి.

---

## ప్రాసభంగమునకుదహరణము

---

క. ఒకవృక్షమూలతలమున

సకలంకగుణాభిరాముఁడాసీనుండై

యకుటిలమతి బదరీవన
మునకునుబొమ్మనుచు మొఱగిపోయిన నేనున్.

స్కం. 3 ప. 141

ఈక్రిందివిధమున నాపద్యముగూర్చి నూత్నముద్రిణపుస్తకములలో గన్పట్టుచున్నది.

క. ఒకవృక్షమూలతలమున
నకలంకగుణాభిరాముఁ డాసీనుండై
యకుటిలమతి బదరీవని
కిఁక నీవరుగుమని మొఱఁగియేగిరి నేనుఁ

# గణభంగమునకుదహరణములు

గీ॥ ఇన్నియును దెలియనానతి యిచ్చినన్ను
నర్థిరక్షింపుయజ్ఞ దానాదిపుణ్య

స్కం. 3. ప 260

గీ॥ రూఢినమ్మనువునకు శతరూపవలన
భూనుతులగు ప్రియవ్రతోత్తానపాదు

స్కం. 4 ప 217

# యతిభంగమునకుదహరణము

సీ॥ మనువు నిత్యముగాదు మరణంబునిజమని
మెఱఁగిమోక్షస్థితి నిశ్చయించి

స్కం 1 ప 393

ఇంకను వ్యాకరణవిరుద్ధంబులైన ప్రయోగంబులునుగలవు. అవి యన్నియు భాగవతమునందు బెక్కుగ వ్రాయుటంజేసి కలిగినలోపములని తలచితినని మొదటనే వ్రాసియుంటి

---

## కాలనిర్ణయము

---

పోతనామాత్యుఁడు శ్రీనాథమహాకవికిని సర్వజ్ఞసింగభూపాలునకును సమకాలికుడని పైనజెప్పిన జరిత్రములవలననే దెలియుచున్నది.

శ్రీనాథుఁడును సర్వజ్ఞ సింగమనాయునికి సమకాలికుడైనట్లీక్రింది పద్యమువలన దెలియుచున్నది

సీ॥ దీనారటంకాల దీర్థమాడించిరి
దక్షిణాధీశుము త్యాలశాల
బలుకుఁదోడ్తై యంధ్ర భాషామహాకావ్య
నైషధగ్రంథసందర్భమునకు
బగులఁగొట్టించితు ద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క.
చంద్రశేఖరక్రియా శక్తిరాయలొద్దఁ
బాదుగొల్పితి సార్వభౌమబిరుద
తే॥గీ. మెట్టులమెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగమహీపాలు కవిశాలు
నిండుకొలువున నెలకొని యుండి నీవు
సరససద్గుణనికురుంబ శారదాంబ.

అనివెంకటగిరియందుండి సమస్తవిద్యలయందును నిరుపమాన పాండిత్యవైభవముననొప్పారి సర్వజ్ఞుఁడని ప్రసిద్ధికెక్కిన సింగభూధవు నాస్థానంబున కేగుతఱి నెక్కడనైన దప్పులుగల్గునేమోయని భయంబడి తనకు బ్రసన్నురాలైన భారతీ దేవిస్తవమొనర్చెననియు జెప్పుదురు.

శ్రీనాథుడు సింగభూపతిని దర్శించినవెనుక యతనియాస్థానము నగల యొక్కబట్టురాజు శ్రీనాథుని వంచించుటకై హాస్యవ్యాజంబున కుక్కవా నక్కవో ఫణివా క్రోతివా పిల్లివా భూతపిల్లివో, యన్ని సమస్యనిచ్చి పూర్తిమొనర్పుమన శ్రీనాథుఁడు

ఉ॥ తక్కకరాపుసింగ ధరణీశ్వరుఁడర్థులకిచ్చుచున్నచో
చిక్కులలేని కర్ణునిదధీచి నిఖేచరువేల్పుమ్రాని బెం
పెక్కినకామధేనువు సిబీంద్రునినెన్నెదుబట్టదిట్టవై
కుక్కవా నక్కవో ఫణివా క్రోతివా పిల్లివా భూతపిల్లివో !

యనిపూరించెననియు, జెప్పుదురు కాన సింగనయు శ్రీనాథు డు నొకకాలమువారని చెప్పవచ్చును.

పోతరాజు వేంకటగిరిసంస్థానమునకు ప్రభువైన సర్వజ్ఞసింగ భూపాలుని యాస్థానకవిపండితుఁడై యుండుటచేఁ బోతరాజప్రణీతమైన భో గినీదండకము తాత్కాలమైయున్నది.

కావున శ్రీనాథుడును సర్వజ్ఞభూపాలుఁడును బమ్మెర-పోతరా జును సమకాలికులని యెంచవచ్చును.

'సర్వజ్ఞసింగమనాయఁడు 1422 సం, మొదలు 1447 సం॥ వఱ కు రాజ్యమేలెను. ఇతఁడు ప్రౌఢదేవరాయలకు సమకాలికుడు సింగ భూపతి రసార్ణవసుధాకరమను నామాంతరముగల సింగభూపాలీయ

నామకాలంకార శాస్త్రమును, సంగీతరత్నాకరవ్యాఖ్యను మఱికొన్ని సంస్కృతగ్రంథములును రచించి, సర్వజ్ఞబిరుదమును వహించినవాఁడు. వీనియందు రసార్ణవసుధాకరమను గ్రంథము రసనాటకాదివిషయమై మూఁడుల్లాసములుగ రచియింపఁబడినది. ఇదియత్యుత్తమగ్రంథము. కావ్యపంచకమునకు వ్యాఖ్యయొనరించి మహామహోపాధ్యాయుఁడను ఖ్యాతివహించిన మల్లినాథసూరిచేఁ దనవ్యాఖ్యలయందచ్చటచ్చట నుదాహరింపఁబడినవి. రఘువంశషష్ఠసర్గమందు నిందుమతీ పరిణయ ఘట్టమున 'తాంప్రత్యభివ్యక్త మనోరథానాం, అనుశ్లోకవ్యాఖ్యానమునందుఁ తత్రశృఙ్గారలక్షణం రసార్ణవసుధాకరే-విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః" అనునది లోనుగా శృంగారలక్షణము రతిలక్షణము అనుభావలక్షణము సింగభూపాలీయము నుండి యుదహరింపబడియె.

మైసూరియందు ముద్రించిన రసార్ణవసుధాకరంబు నుపోద్ఘాతమునను, మల్లినాథేనచబహవో ఽస్మాద్గ్రంథాత్సముద్ధృతా రఘువంశాది వ్యాఖ్యానేషు లిఖితాదృశ్యంతే అని వ్రాయబడినది. అలంకారశిరోమణియందుఁ బ్రతాపరుద్రీయవ్యాఖ్యయందును శాకుంతల బాలరామాయణాది నాటకవ్యాఖ్యలులోనగు ననేక గ్రంథములయందు నీగ్రంథము ప్రమాణముగాఁ బరిగ్రహింపఁబడినది. హూణశకము పదునాల్గవశతాబ్దము నుత్తరభాగమున నీగ్రంథమును రచియించినట్లున్నది. కావ 10 వ తరము సింగమనాయుఁడే రసార్ణవసుధాకరకర్తయని యింతదాక వ్రాయఁబడిన గ్రంథములలోఁ గాన్పించుచున్నది. కాని యది సరికాదు రసార్ణవసుధాకరగ్రంథసందర్భము చేతను మఱికొన్ని కారణములచేతను నేడవతరము సింగభూపతియే రసార్ణవసుధాకరకర్త గాని పదవతరమువాఁడు కాఁడు. ఈవల చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున దొరకిన ప్రౌఢదేవరాయులవారిశాసనము స్వస్తిశ్రీవిజయా

భ్యుదయ శాలివాహనశకవర్షంబులు 1380 అగనేటి బహుధాన్యసంవత్సర మాఘ బ 30 సోమవారము సూర్యోపరాగపుణ్యకాలమునందు ఆత్రేయసగోత్రోద్భవులైన శ్రీ మహారాజాధిరాజరాజపరమేశ్వర రాజశ్రీ ప్రౌఢదేవరాయలు విద్యానగరమందు వజ్రసింహాసనారూఢులై పృథివీ రాజ్యంబు చేయుచును శ్రీశైలమునకు తులాభారము తూగనువచ్చి బహుధాన్యసంవత్సర మాఘ బ 30 సోమవారము సూర్యగ్రహణ పుణ్యకాలమునందు స్వాతీనక్షత్రమందు సిద్ధాపురములోనికి చెల్లివచ్చే చిన్నఅనంతాపురగ్రామము గార్గేయసగోత్రా ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయులైన నిడిచెనమెట్ల తిరుమలభట్లు గంగావజ్ఝలు అన్నావజ్ఝలుగారికిన్ని భారద్వాజసగోత్రులైన ఆపస్తంబసూత్రులైన బొందలపాటి తిరుమలభట్లవారికి నగ్రహారముగ నిచ్చిరన నారాజు శాలివాహనశకము 1380 అనగా హూణశకము 1458 సంవత్సరము తులాభారముదూగుటకై శ్రీశైలంబునకుఁ బోయినట్లు దెల్పబడియున్నది. గాన యంతకుమున్న యాతడు రాజ్యమేలుచున్నట్లు స్పష్టపడుచున్నది. కాబట్టి దీనింబట్టి ప్రౌఢదేవరాయలు 1458 సంవత్సరమునకు బూర్వమే యెప్పుడో రాజ్యారంభము చేసినట్లు తోచెని. శ్రీనాథుడు కొండవీటి కైఫయత్తులోనున్నప్రకారము కోమటి వెంకారెడ్డి ఆస్థానకవిగా ఉన్నాడు. కోమటి వెంకారెడ్డి క్రీ॥ శ॥ 1395 సం॥రం మొదలు 1423 సం॥ రం వాఁక రాజ్యముచేసినాడు. 1379 సం॥ మొదలు 1401 సం॥ రం వఱకు రాజ్యముచేసిన హరిహరరాయలు ఒంటిస్తంభపుమేడ కట్టింపఁదలచి సభయందుఁ గూర్చుండి యెవరైన నొంటిస్తంభపుమేడ యింతకుఁ బూర్వముకట్టినారాయని యడుగ నచ్చుటనున్న శ్రీనాథుడు లేచి కోమటి వెంకారెడ్డి కొండవీటిలోఁగట్టించుచుండెనని చెప్పెను. హరవిలాసమును గృతినొందిన తిప్పయ్య కొండవీటికుమారగిరి భూపాలునకు సుంగధద్రవ్యములిచ్చువాఁడు. ఈ

కుమారగిరి భూపాలుంకు 1381 సం॥రం మొదలు 1395 సం॥ రం॥ వఱకు రాజ్యము చేసినవాండు వీరభద్రరెడ్డిపేరుగ 1415 సం॥రం ము నకు బూర్వమే రాజ్యమునకువచ్చి 1436 సం॥ రం వఱకు రాజ్యము చేసినట్లు దృష్టాంతములుగల యల్లాడ వేమారెడ్డియొద్ద నతండాస్థాన కవీశ్వరుడుగా నుండెను.

మఱియు భీమేశ్వరపురాణములోను

ఉ॥ అన్నయ మంత్రి శేఖరుండహమ్మదుశాసనదానభూమిభృ
త్సన్నిధికిన్ మదిన్ సముచితంబుగ వేమ మహీసురేంద్ర తా
జ్యోన్నతి సంతతాభ్యుదయ మొందగ బారసిభాష వ్రాసినం
గన్నులపండువై యమరుగాకితమందలివర్ణపద్ధతుల్.

అనుపద్యమువలన నహమ్మదుషా రాజ్యమునకువచ్చినతరువా తనే భీమఖండము రచియింపబడినట్లు తేలుచున్నది. ఈతండు కల్బరిగ (Kulburga) రాజధానిగ బాలించెను. భామినీరాజులలో నహమ్మదు షాయొకడు. ఈయన క్రీ. శ. 1422 సం॥ రం॥ మొదలు 1435 సం॥ రం॥ వఱకు రాజ్యముచేసెను. దీనినిబట్టి భీమఖండము 1424 సం॥రం॥ ప్రాంతమున శ్రీనాధుడురచించియుండెనని చెప్పనగును కావుననితడు క్రీ. శ. 1384 సం. రం ప్రాంతమునజన్మించి, 1404 సం॥ రం॥ నైషధము, 1424 సం॥ రం॥ ప్రాంతమునభీమఖండము, 1432 సం॥ రం॥ ప్రాంతమున గాశీఖండము, నాంధ్రీకరించియుండును. కావున శ్రీనా థుడు 1384 సం॥ రం॥న జన్మించి 1432 సం॥ రం॥ ములకుమీదజీవిం చినవాడు. సర్వజ్ఞసింగమనాయుడు 1422 సం॥ రం మొదలు 1447 సం॥ రం వఱకు బాలించినవాడు. పైగనిన పెద్దలకాలమునుబట్ట చూడగా బమ్మెర పోతరాజు పదునేనవశతాబ్దపు మొదటి యర్థభాగ మునయున్నవాండని తోచుచున్నది.

బమ్మెర పోతరాజింతకు సుమారు నాలుగువందలేండ్లక్రితము వాఁడని తెలియుచున్నది.

---

# పోతనకృతగ్రంథములు

---

ఈతఁడు భోగినీదండకమును, భాగవతమును వీరభద్రవిజయము రచించెనని దోఁచుచున్నది. నాకుజిక్కిన భోగినీదండకమునందుగలకొంత భాగము నేయీాదిగువ వ్రాయుచుంటి.

---

## భోగినీదండకము.

---

'కామానలజ్వాలలన్వేగి చింతాభరభ్రాంతయై యున్న యింతిం బరీక్షించి తన్మాత మాయాపరాభూత జామాత మిథ్యానయోపేత విజ్ఞాతనానావశీకార మంత్రౌషధవ్రాతలోకైక విఖ్యాతవారాంగనా ధర్మ శిక్షాధిసంఖ్యాత సమ్మోహితానేక రాజన్యసంఘాత నాచాల తాబద్ధ నానామహాభూత యేతెంచికూతున్ బరీక్షించి నీతిన్విచారించి బుద్ధిన్వివేకించి బాలా మిళత్కుంతలవ్రాత ఫాలాగరాంభోజ రాజత్కపోలా సమందోష్ణనిశ్వాసతాలన్ విపర్యస్తనన్యాసచేలన్ మహాందోళనప్రేంఖితస్వర్ణడోలా మృగేంద్రావలగ్నా దయావృష్టిమగ్నన్ మనోజాగ్నిభగ్నన్....విలోకించి లోనంబరాయత్తయై చిత్తజాత్తాసి ధారాచలచ్చిత్త విన్నయై భిన్నయైయున్నభావంబు భావించి నెయ్యం

బుగావించి బాలాజితత్వంబు మేలావిచారింప వేలావినోదింప నేలా వయోధర్మముల్ రిత్తగాఁబుచ్చ నీవృత్తికిన్నెత్తురే కాముకుల్ డాయగాయంబు విద్యున్నికాయోప మేయంబు ప్రాయంబు ధారాధరచ్ఛాయ నెన్నే నుపాయంబులన్ విత్తమాయత్తముం జేయు మారిక్ధ్వారంబు వేరంబుగాదీ విచారంబు వంశానుచారంబు సంసారసారంబు లాభాదికారంబు" &c

భాగవతమునందు దక్షుడు శంకరుని నిందించిన సందర్భమున నీ పోతన యీక్రిందివిధమున వ్రాసియుండె.

తే॥ గీ. వినుఁడుమీరలురోదమాని విబుధమునిహు
తాశనాది నరోత్తములార మోహ
మత్సరోక్తులు గావు నామాటలనుచు
వారికందఱ కాపురవైరిఁజూపె

సీ. పరికింపనితఁడు దిక్పాలయశోహాని
కరుడీ క్రియాసూన్యపరునిచేత
గరమొప్పసజ్జనాచరితమార్గము దూషి
తంబయ్యెనెన్నగ తత్ప్రపుండు
మహితసావిత్రిసమానను సాధ్వీన
స్మత్తనూజను మృగశాబనేత్ర
ననలభూసురబంధుజన సమక్షమున మ
ర్కటలోచనుడుగరగ్రహణమర్థి
జేసి తా శిష్యభావంబు జెందుటాత్మ
దలఁచిప్రత్యుద్గతాభి వందనములెలమి
నడపకుండిన మానసీనన్నుగన్న
నోరిమాటకుఁదనకేమి గోరవోమె.

సీ. అనయంబులుప్త క్రియాకలాపుఁడుమాన
హీనుఁడు మర్యాదలేనివాడు
మత్తప్రచారుఁ డున్మత్తప్రియుఁడు దిగం
బరుడుభూతప్రేతపరివృతుండు
దామసప్రమథభూతలమునకు నాథుండు
భూతిలిప్తుండస్థి భూషణుండు
నష్టశౌచుండు నున్మదనాథుఁడును దుష్ట
హృదయుఁ డుగ్రుడునుప రేతభూమి

గీ॥ కేతనుఁడు వితతప్రస్త కేశుఁడశుచి
యతనితన కొక్క శివనామమను ప్రవాద
గలిగెఁగాని యశివుఁడని కానకెఱిగి
యెఱిగి వేదంబుశూద్రున కిచ్చినటుల

వ॥ ఇతనికి నస్మత్తనూజను విధివత్ప్రకారంబున నిచ్చితి.

సీ. సకలవర్ణాశ్రమాచార హేతువులోక
మునకు మంగళమార్గము సనాత
నముఁబూర్వఋషిసమ్మతము జనార్దనమూల
మును నిత్యమును శుద్ధమునుబరంబు
నార్యపథానుగంబగు వేదమును విప్ర
గణమునిందించిన కారణమున
నేశివదీక్షయందేని మతృమపూజ్యు
డై భూతపతి దైవమగుచునుండు

గీ॥ నందుమీరలు భస్మజటాస్థిధార
ణములఁదగిమూఢ బుద్ధులనష్టశౌచ

లై నశింతురు పాషండులగుచు ననుచు
శాప మొనరించె నాద్విజసత్తముండు'

ఇట్లు శివనిందయొనర్చె. శైవులు విష్ణుని వైష్ణవులు శివుని నిందిం
కలదు. శైవులు శివుని వైష్ణవులు విష్ణుని నిందించువారు లేరు. పోత
చారసంపన్నుడై శంకరుని దూషించుట చదువరులకే కాదు. క
డును దోషమని యెతలచి వీరభద్రవిజయమని శైవగ్రంథము
ను. ఈకవి నన్నయ క్రిందివిధముగ వ్రాసిన పద్దెము ననుసరించి పోత
వనిందానివారణార్థమై వీరభద్రవిజయమును రచించెననవచ్చును.

ఉ. భాగవతప్రబంధమతి భాసురత న్రచియించి దక్షవృ
ద్యాగకథాప్రసంగమున నల్పవచస్కుడనైతద
త్త్యాగమవక్త్రిదోషపరి హారతకై యపనైకశైవశా
స్త్రాగదు వీరభద్రవిజయంబు రచించెద వేడ్కతోడుతన్.

---

# వీరభద్రవిజయములో విషయము

---

శా. వీరా! దక్షియదక్షమానస వృథాయీదూషణంబేలరా
మోరే పాపములెల్ల బోవిడువు రాయుగాగ్రితుడు లేపట్టురా
వైరంబొప్పదు శివుం దలపురా వర్ణింపురా నాజ్ఞతో
శారాత్ముండగు నీలకంఠు డెగడంగా రాదు రా మూర్ఖతీ.

అతికోమలములైనపదములతో, మనోజ్ఞములైన యలంకా
లతో సరసములైన రచనలతో, మధురమైన పాకముతో నగ్గల
భక్తితో మిక్కుటమైన పాండిత్యముతో నహాంచమైన లోకా
భంబుతో నలరు గ్రంథరాజముల బోతన్నరచియించి సాహాయంబ
కాయంబు నొఱంగియు జీవించి రసజ్ఞశిఖామణులగు పాఠకుల వ
యారవిందంబుల నాట్యమొనర్చుచున్నవాఁడు. ఈతని గ్రంథ
నాంధ్రదేశీయులెల్లరుఁ బెల్లుగాఁజదివి భవరుగార్తులును భావ
ర్థులును, సుకవిపుంగవులును భాగవతులును, ముముక్షువులును
ముగా నిర్లేపత్వమును, భాషాపరిజ్ఞానమును, బ్రహ్మానందమును
భక్తిని, మోక్షమును బొందుదురుగాక యని యనుగ్రహింప పరమే
రుని వేడుచు నీపొత్తమును ముగించుచున్నాను.

సంపూర్ణము.





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B169 |
| పుస్తకం పేరు | బమ్మెరపోతరాజు |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | II ,B |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | HAEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |